JAGATI Rs. 2-00 August 1992

37th Year of Publication

433

ఆగస్టు - 1992

## సాహితీ సుధ

కరిరాజున్ బిసతంతు సంతతులచే గట్టన్ విజృంభించు వా
డురు వజ్రంబు శిరీష పుష్పములచే నూహించు ఛేదింప దీ
పరవింతన్ లవణాబ్ధికిన్ మధుకణ ప్రాప్తిం బ్రవర్తించు ని
ద్ధరణిన్ మూర్ఖుల దెల్పు నెవ్వడు సుధాధారాను కారోక్తులన్

—భర్తృహరి

ఇంతింతై వటు డింతయై, మరియు దానింతై నభోవీథిపై
నంతై, తోయద మండలాగ్రమున కల్లంతై, ప్రభారాశిపై
నంతై, చంద్రుని కంతయై, ధ్రువునిపై నంతై, మహర్వాటిపై
నంతై, సత్య పదోన్నతుం డగుచు బ్రహ్మాండాంత సంవర్ధియై

—పోతన భాగవతం - వామనమూర్తి

తప్పు లెన్ను వారు తండోప తండమ్ము - లుర్వి జనుల కెల్ల నుండు దప్పు
తప్పు లెన్నువారు తమ తప్పు లెరుగరు - విశ్వదాభిరామ వినుర వేమ

— వేమన

'జ గ తి' - 2, కచేరీ రోడ్, మైలాపూర్, పి బి 2922, మద్రాసు - 600 004.
ఫోన్: 76697 - చందా 2 సం॥లకు రు. 50-00- 4 సం॥లకు రు. 100-00 - జీవిత చందా రు. 300-00. పాట్రన్ - 1000-00. విదేశాలకు: అ॥ డాలర్లు 75.

ముఖచిత్రం: శంకరదయాళ్ శర్మ

# నిమ్మతోనాలు

ఇవాళ ఏం జరిగిందో తెలుసాండీ ?- అంది లలిత.

"నీవు చెప్పనిదే నాకు ఎలా తెలుస్తుంది?" - అన్నాడు లలిత భర్త శ్రీనివాసరావు.

"ఇందాక సూపర్ మార్కెట్‌కెళ్లి వస్తూండగా ఒక గుడ్డి బిచ్చగాడు కనిపించాడు. అయ్యో పాపం - అని జాలిపడి ఒక రూపాయి బిళ్ల చేతిలో వేశాను. 'అమ్మా, వంగ పండు రంగు చీరెలో నీవు లక్ష్మీదేవిలా ఉన్నావు - కలకాలం యింత అందంగానే వుండాలి, తల్లీ' - అన్నాడు. అప్పుడు తెలిసింది వాడు నిజంగా గుడ్డవాడు కాదని !"

"అబ్బే, వాడు గుడ్డివాడే !"

"గుడ్డివాడైతే నేను కట్టుకున్న చీరె రంగు ఎలా తెలుస్తుంది? నేను అందంగా వున్నానని ఎలా మెచ్చుకుంటాడు ?"

"నీ అందాన్ని మెచ్చుకొనే వాడు గుడ్డివాడు గాక.... !"

—యమ్ శ్రీనివాసరావు
ఫిరంగిపురం

రాత్రివేళ ఆటో ఎక్కి 'దిల్‌షుక్ నగర్' అన్నాడు ఫణీంద్ర.

ఆ సమీపాలకి రాగానే 'ఒక్కసారి ఆటో ఆపు - పాంటు జేబులో నుంచి నూరురూపాయల నోటు జారి పడింది. కాస్త వెతుకుతూండు. ఆ బడ్డీ కొట్టులో నుంచి అగ్గిపెట్టె కొని తీసుకొస్తాను" - అంటూ కొట్టు వైపు వెళ్లాడు ఫణీంద్ర.

ఈ పాసింజరు చెప్పినది నిజమే ననుకొని, చీకట్లోగాక వెలుతురులోకి వచ్చాక వెతుక్కో వచ్చునని వెళ్లిపోయాడు ఆటో డ్రయివరు.

"హమ్మయ్య, పథకం ఫలించింది - పదిరూపాయిలు మిగులు" - అని తృప్తి పడ్డాడు ఫణీంద్ర.

అతని దగ్గిర నూరు రూపాయిల నోటు వుంటేకదా పోయేందుకు !

—సి దేవీ వరప్రసాద్
వుద్రేల

ఏదుంకయ్యా, మురళీ అంత దిగులుగా కూచున్నావ్? మీ ఆఫీసరు గాని, విసుక్కున్నాడా ?" అని యోగక్షేమం విచారించాడు సంజీవరావు.

"మా ఆఫీసరు చాలా మంచివాడు. కోప్పడటం, చిరాకు పడటం లాటివి ఆయన స్వభావంలో లేవు."

"ఫ్రెండ్స్‌తో ఏమయినా తగాదా వచ్చిందా ?" - అని ప్రశ్నించాడు సంజీవరావు.

"నా ఫ్రెండ్స్ందరూ చాలా మంచి వాళ్లు - పేచీలు పడరు, పేచిలు పెట్టు కోరు" - అన్నాడు.

"ఎవర్నయినా ప్రేమించావా ?"

"అటువంటి చెడుబుద్ధులు మా యింటా వంటా లేవు."

"అయితే, ఎందకయ్యా ఆ మన స్తాపం ?" – అని సంజీవరావు.

"మా నాన్న వచ్చే నెలలో పెళ్లి చేస్తానంటున్నాడు. పెళ్లి చేసుకున్నాక యిక స్వాతంత్ర్యం ఏముంటుంది ? ప్రతి పైసాకీ లెఖ్ఖ చెప్పాలి ; పది నిముషాలు ఆలస్యమైతే సంజాయిషీ యిచ్చుకోవాలి"

—పియమ్ సుందరరావు
విజయవాడ-8

సరోజా, శ్రీధరూ గాఢంగా ప్రేమించు కుంటున్నారు ; ప్రేమ చీటీలు రాసుకుంటున్నారు ; ప్రేమ లోకంలో విహరిస్తున్నారు. ఒక సంధ్యాసమ యాన పార్కు బెంచీ మీద కూచుని సరోజ అడిగింది :

"మీరు నన్ను త్రికరణ శుద్ధిగా, మనసా, వాచా, కర్మణా ప్రేమిస్తు న్నారు కదూ ?"

"ఈ పంచభూతముల సాక్షిగా ఈ పార్కు మొక్కల సాక్షిగా...."

"ఉండండి, ఉండండి, నన్ను మించిన సౌందర్యరాశి లేదు కదూ – అదే మీ దృష్టిలో ?"

"అందుకు సందేహమా ?"

"నా కనులు వినీల కాంతులు విరజిమ్ముతూంటాయి కదా ?'

"అవును - అది నాకే తెలుసు. నా కళ్లకే తెలుసు."

"నా పెదవులు గులాబీ రేకులా ?"

"అవును"

"ఎందుకండీ ఈ అబద్ధాలు ?"

"వారి జాతకులందు, వైవాహికము లందు అబద్ధాలు చెప్పగల లైసెన్సు ఆర్యులు యిచ్చారు."

—కె వెంకటరామ్
పామర్రు

# పాఠకుల తీర్పు

చందూర్‌గారికి : 'జ గ తి' ప్రతి నెలా మాకు మద్రాసులోని ప్రముఖులు, ప్రత్యేక సమావేశాలు గురించి చాలా చక్కగా చెబుతోంది - విలువైన పత్రిక ప్రచురిస్తున్నారు. మాలతి గారికి డాక్టరేటూ, భారతీయ భాషా పరిషత్తు అవార్డూ వచ్చిన సందర్భంగా మా మనః పూర్వక అభినందనలు.

—నోరి వెంకటేశ్వర్లు
న్యూఢిల్లీ-67

చందూర్‌జీ: ఢిల్లీలో వున్న నా వంటి వారికి 'జ గ తి' ఎంతో ఆనందాన్ని కలిగిస్తున్నది. తల్లాప్రగడ ప్రకాశరాయడి గారి 'నా రాట్న చక్రం' వల్ల, ఆంధ్ర దేశంలో జరిగిన ఉద్యమాల గురించి, అభ్యుదయ భావాల వ్యాప్తి గురించి తెలుస్తున్నది. మీరు వ్రాసే 'డైరీ' అంటే నాకు మహా ఇష్టం. బెంగుళూరులో జరిగిన అంతర్జాతీయ చలన చిత్రోత్సవానికి మీరు వెళ్లలేదా ? వెళ్తే, ఆ విశేషాలు మాకు చెప్పి వుందురు.

—కె విజయ్
న్యూఢిల్లీ-2

సంపాదకులకు : నమస్కారం. ఏప్రిల్ సంచికపై ఆచంట జానకి రామ్‌గారి చిత్రం, వారు సాగించిన యాత్రకు సంకేతం. అమృత హృదయులు జానకిరామ్‌గారికి బాష్పాంజలి. 'రూట్స్' టెలిఫిలిమ్ పరిచయం రసార్ద్రంగా ఉన్నందుకు ధన్యవాదాలు.

—జానమద్ది హనుమచ్ఛాస్త్రి
కడప-4

చందూర్‌గారికి : నమస్కారం.... మీరు, మాలతిగారు కలకత్తాలో ఉన్నది నాలుగురోజులే అయినా, ఆ నాలుగు రోజులు మీ దంపతులతో గడిపే అదృష్టం లభించటం వలన, ఆ జ్ఞాపకాలు పూపరిమళంలా ఆహ్లాదకరంగా ఉన్నాయి.... 'జ గ తి' యిన్నాళ్లూ చదవని కారణంగా ఎంత 'మిస్' అయానో అనిపిస్తోంది..... ఆచంట జానకిరామ్ గారి గురించి మీరు రేడియోలో చెప్పి ప్రచురించినది మనసుని ద్రవీ భూతం చేసింది. ఇక, మీ 'డై రీ' గురించి చెప్పనక్కర్లేదు - మమ్మల్ని మీ వెంట నడిపిస్తారు. సుబ్బారావుగారినీ, నన్నూ మీరు జ్ఞాపకం పెట్టుకున్నారనే విషయం చాలా ఆనందకరం.

—యన్ ప్రమీల
కలకత్తా-53

## తిరుపతి వేంకట కవులు

ఆనాడు తిరుపతి వెంకట కవుల కవితా మాధుర్యానికి, శైలీ ప్రభావానికి లోనై, వారివద్ద శుశ్రూష చేయాలనే కుతూహలంతో అనేకమంది యువ కవులు వారి వద్ద చేరి తిరుపతి వేంకట కవుల వలెనే పద్యాలు చెప్పాలనీ, వెంకటశాస్త్రి గారి జలద గంభీర స్వరాన్ని అనుకరిస్తూ పద్యం చదవాలనీ ఉబలాట పడేవారు. ఆనాడాంధ్ర దేశంలో ఎక్కడ చూచినా తిరుపతి వెంకటకవుల శిష్యులే, ప్రశిష్యులే, ఏకలవ్య శిష్యులే, వేలూరి, వేటూరి, అవ్వారి. ఓలేటి, నెమలూరి, పింగళి, కాటూరి, విశ్వనాథ, మాధవపెద్ది మున్నగు శిష్య ప్రకాండులను సంపాదించిన కీర్తి వారికే దక్కింది. 'చెళ్లపిళ్ల వేంకన గురువంచు చెప్పికొనగా నది గొప్ప తెలుంగు నాడునన్' అన్న వాక్యం నుడిగా రూపొందింది.

—ఆర్ ఏకాంబరాచార్యులు

'స్రవంతి' లో

## అండమాన్

అండమాన్ నికోబార్ దీవుల్లో ప్రధానంగా రెండు జాతుల వారున్నారు. ఒకటి నీగ్రిటో (Negrito) రెండవది మంగోలాయిడ్ (Mongoloid). నీగ్రిటో జాతివారు అండమాన్ దీవుల్లోనూ మంగోలాయిడ జాతివారు నికోబార్ దీవుల్లోనూ నివసిస్తూ ఉంటారు. నీగ్రిటో జాతిలో, అండమానీస్, జార్వాస్, ఓన్జీస్, సెంతినేలీస్ అనే నాలుగు తెగలున్నా మంగోలియడ్ జాతిలో నికోబారీస్, షాంపిన్స్ అనే తెగలున్నా నివసిస్తున్నాయి. ఈ రెండు జాతుల ప్రజలు ముఖ నిర్మాణం, రంగు రీత్యా వేర్వేరు జాతుల వారని పోల్చుకోవచ్చు.... ఒక తెగ ప్రజలు అత్యంత త్వరిత గతిన క్షీణించిపోతున్నారు. ప్రస్తుతం వారి సంఖ్య కేవలం 28 మందికే దిగి పోయింది. ఓన్జీస్ అనే తెగ లిటిల్ అండమాన్‌లో నివసిస్తున్నారు. వీరి సంఖ్య కూడా బాగా తగ్గిపోయి ఇప్పుడు కేవలం 95 మంది మాత్రమే ఉన్నారు.

—మలిక్

'గీటురాయి'లో

---

మన వ్యక్తిగత జీవితంలో యితరులతో ఏ మాత్రం ప్రమేయం లేనిది వివాహం. కాని, ఈ వివాహం విషయంలోనే ప్రతివాళ్లూ వచ్చి మనకు సలహాలు చెప్పి బాగుంచేదామనుకొంటారు. —సెల్డాన్

---

# పాతికేళ్ల నాటి పిక్చర్

కౌముదీవారి

## 'కాల చక్రం'

కన్నెపిల్ల, కొంటె పిల్లల తర్వాత కాల చక్రం. ఈ మూడు డబ్బింగ్ చిత్రాలూ ఒక సంవత్సరం వ్యవధిలో నిర్మించి విడుదల చేశారు కవితోత్సాహం గల నిర్మాత యమ్. యస్. రెడ్డి. డబ్బింగ్ చిత్రంలోని ముఖ్యుల పేర్లని బటి జనాకర్షణ ఏ తీరున వుండేదీ ముందే అంచనా వేసుకోవచ్చు. తమిళ తెరకు రాబిన్ హుడ్ వంటి యమ్‌జి రామచంద్రన్ ; హాస్య నటనా విశారదుడు నాగేష్ ; ప్రథమ చిత్రంతోనే ప్రేక్షకుల నాకట్టుకు, షావుకార్ జానకి అయిన జానకి ; సొగసులు చిందించే గీతాంజలి ; భారత నారీ లలామకు ప్రతిరూపమైన కెఆర్ విజయ - యిందరు అభిమాన నటీనటులుండగా సామాన్య ప్రేక్షకునికి యింతకంటె ఏం కావాలి ? వీరి నటనా వైదుష్యానికి తోడుగా కవ్వించేవీ కలవర పరిచేవీ పాటలూ, రూప లావణ్యాలు గల సుందరీమణుల నృత్యాలూ, కాసేపు ప్రగతి సూచక సంస్కరణోపదేశం, మరి కాసేపు సంప్రదాయం గౌరవించమనే నీతి బోధ - ఈ విధంగా సాగుతుంది కథాగమనం. రామలక్ష్మణుల్లాటి యిద్దరన్నదమ్ములు. వారు ఆదర్శప్రాయులవటం వల్ల, ఆస్తులు పంచుకు ఎవరి బతుకు వారు బతికే పద్ధతికి వ్యతిరేకులు. తొందరబాటున విడిపోయినా, ముక్కలు మళ్లీ అతుక్కు, అవిభక్త కుటుంబ వ్యవస్థ పునర్నిర్మితం కావాలంటారు. అన్ని విలువలూ గాలికి వొదిలేసిన వనిత, విలాసాల మధ్య, క్షణికోద్రేకాల మధ్య జీవితమంతా గడిపి మరణ సమయాన పవిత్ర భారత మహిళా ధర్మంలోని ఔన్నత్యం గురించి చెబుతుంది - అంటే, అప్పటికామెకు వివేకం కలిగిందన్నమాట! ప్రమాదంలో చిక్కుకున్న అమ్మాయి నాయకునికి తటస్థపడగా ధీరోదాత్తుడు ఆమెని కాపాడుతాడు ; ఆ పేదపిల్ల సన్నిహితురాలధీవడమేగాక సఖి, ప్రియ సఖి, ప్రాణసఖి అవుతుంది. భాగ్యవంతుడు బీద పిల్లని యిట్టే పెళ్ళి చేసేసుకోవడం కాదు - బీరకాయ పీచు లాటి బంధుత్వమేదో ఉంటుంది. ప్రేమ ఫలిస్తుంది కుటుంబ ప్రతిష్ట నిలబెట్టే వంశోద్ధారకుడు జనించాక 'కాల చక్రం' సుఖాంతమవుతుంది.

—యన్నార్ చందూర్ సమీక్ష

'జగతి' - ఆగస్టు 1967

## 'ఆర్ప్ - 220'

ఢీ కొంటున్న రెండు గెలాక్సీలలో త్వరిత గతిన జరుగుతున్న నక్షత్ర విస్ఫోటనం. ఆ పర్యవసానంగా జరుగుతున్న వేలాది నక్షత్రాల ఆవిర్భావాల తాలూకు చిత్రాలను అంతరిక్షంలో పరిభ్రమిస్తున్న హబుల్ టెలిస్కోపు ఇటీవల సేకరించింది. నక్షత్ర విస్ఫోటనం జరుగుతున్న 'ఆర్ప్ - 220' అనే గెలాక్సీ భూమికి 23 కోట్ల కాంతి సంవత్సరాల దూరంలో 'కరోనా బొరియాలిస్' కాన్‌స్టలేషన్‌లో వున్నది. (సెకనుకు 297,600 కిలోమీటర్ల వేగంతో కాంతి ఒక సంవత్సర కాలంలో ప్రయాణించే దూరాన్ని కాంతి సంవత్సరం అంటారు). 'ఆర్ప్ - 220' గెలాక్సీకి సంబంధించిన తాజా చిత్రాలలో రెండు గెలాక్సీల 'ఘర్షణ'లో ఆరు భారీ నక్షత్ర సముదాయాలు ఏర్పడినట్టు కనిపించింది. వీటిలోని ప్రతి నక్షత్ర సముదాయమూ కూడా సూర్యుని కంటె 10వేల కోట్ల రెట్లు ఎక్కువ కాంతివంతమైనది కావడంతో పాటు ఇంతవరకు మానవునికి తెలిసిన నక్షత్ర సముదాయాలన్నిటి కంటె పదిరెట్లు పెద్దది కావడం విశేషం. ఈ 'ఆర్ప్ - 220' అనేది పరస్పరం ఢీ కొంటున్న రెండు గెలాక్సీల కలయిక అని ఖగోళ శాస్త్రజ్ఞులు భావిస్తున్నారు. రెండు గెలాక్సీలు ఢీ కొన్నప్పుడు కోట్లాది సూర్యులు, తమ మాతృ గెలాక్సీ నుంచి చెదిరిపోయి అంతరిక్షంలో అనేక చోట్లకు వెళ్ళిపోవడం జరుగుతుంది. కాగా ఈ గెలాక్సీల 'ఘర్షణ' లక్షలాది సంవత్సరాల పాటు కొనసాగుతుంది. 'ఆర్ప్ - 220' గెలాక్సీని తొలిసారిగా 1980 దశకంలో ఇన్‌ఫ్రారెడ్ అస్ట్రానమీ శాటిలైట్ (ఐ ఆర్ ఎస్) కనుగొంది. ఇప్పుడు హబుల్ టెలిస్కోపు తీసిన చిత్రాలు ఈ గెలాక్సీకి సంబంధించి ఇదివరకు తెలియని అనేక వివరాలను తెలియజేశాయి. 'నాసా', యూరోపియన్ స్పేస్ ఏజెన్సీలు సమకూర్చిన పరికరాలతో ఈ 'హబుల్' పరిశోధనా కార్యక్రమం ఒక అంతర్జాతీయ ప్రాజెక్టుగా కొనసాగుతోంది. ...

(అమెరికా సమాచార శాఖ

## హాండ్ మేడ్ పేపరు

హాండ్ మేడ్ పేపరు పరిశ్రమకు మనదేశంలో ఎనిమిది వందల సంవత్సరముల సుదీర్ఘ చరిత్ర కలదు. ప్రపంచంలో ఈ విధమైన పేపర్‌ను తయారు చేసే దేశాలలో భారతదేశం ప్రథమ స్థానాన్ని పొందినది. సాలీనా 7,500 టన్నుల పేపర్ ఉత్పత్తి చేయబడుతుంది. దీనిలో 400 టన్నుల పేపర్ విక్రయం ద్వారా రు. 1.2 కోట్ల విదేశీ మారక ద్రవ్యాన్ని మనం పొందగలుగుతున్నాం. బ్రిటన్, ఆస్ట్రేలియా, జర్మనీ, అమెరికా, కెనడా దేశాలకు ఈ పేపర్ ఎగుమతి అవుతోంది. ఉత్తరప్రదేశ్ మొత్తం ఉత్పత్తిలో 38 శాతాన్ని చేస్తూ, ప్రథమ స్థానాన్ని పొందగా, మహారాష్ట్ర, తమిళనాడు, రాష్ట్రాలవి తరువాత స్థానాలు. ఈ పేపర్ వినిమయంలో ఇప్పటి వరకు ప్రభుత్వ సంస్థలు ఎక్కువ ఆసక్తిని చూపిస్తున్నాయి. హాండ్ మేడ్ పేపరు పరిశ్రమలో 25 నుండి 30 శాతం వరకు కార్మికులకు వేతనాల రూపంలో లభిస్తుంది - మామూలు కాగితపు పరిశ్రమలలో ఎనిమిది శాతం మాత్రమే వేతనాలుగా వెళ్తుంది. ముడిసరుకు కొరకు ఎంతో విలువైన కలప, తద్వారా అడవుల నరికివేత అవసరం లేదు. ఈ పేపర్ తయారీకి యంత్రాలను దిగుమతి చేసుకొనవలసిన అవసరం లేదు. నూటికి నూరుశాతం పెట్టుబడి వికేంద్రీకరణ చేయబడుతుంది. ఇతర పరిశ్రమల వలె భూమి, నీరు, గాలి కాలుష్య సమస్య వుండదు; 25 నుండి 40 శాతం వరకు మహిళలకు ఉపాధి కల్పించవచ్చు. తక్కువ పెట్టుబడి, తక్కువ నిర్వహణ వ్యయాలతో, ఎక్కువ ఉపాధి - వేతనాలతో ఏ ప్రాంతములోనయినా నిర్వహించగల పరిశ్రమగా చెప్పవచ్చు. నైపుణ్యత కల వ్యక్తుల కొరత, ఆర్థిక ఇబ్బందులు, పబ్లిసిటీ లేకపోవటం వల్ల ఈ పరిశ్రమ మార్కెట్‌లో అనుకొన్నంతగా అభివృద్ధి చెందటం లేదు. భవిష్యత్తులో మార్కెట్ పోటీకి తట్టుకొని, గ్రామాలలోను చిన్న పట్టణాలలో ఉపాధి కల్పించే ఈ పరిశ్రమల అభివృద్ధి చాలా అవసరం. నాణ్యతను పెంచి, ఉత్పత్తులను అధికం చేయుట కొరకు అవగాహన, శిక్షణా తరగతులు ఏర్పాటు కావాలి. ప్రదర్శనల ద్వారా మార్కెట్‌ను కల్పించవచ్చు. ప్రభుత్వ, ప్రభుత్వేతర సంస్థలు ఈ పేపర్‌ను వినియోగిస్తూ అన్ని విధములా ఉన్నతమైన ఈ పేపర్‌ను వాడి, తద్వారా పరిశ్రమ అభివృద్ధికి తోడ్పడటం ఉభయతారకంగా ఉంటుంది ....

(సర్వోదయా ప్రెస్ సర్వీస్

## మన జనాభా

మన దేశంలో పదేళ్లకొకసారి జరిగే జనాభా లెక్కల సేకరణ ఈ ఏడాది ఫిబ్రవరి 9 నుంచి మార్చి 5 వ తేదీ వరకు జరిగింది. సాధారణంగా ఈ తతంగాని కంతటికీ కొంత వ్యవధి

పడుతుంది. అయితే ఈసారి జనగణన కార్యక్రమం చకచకా పూర్తికావటమే కాకుండా, అతి స్వల్ప వ్యవధిలో కూడా ప్రకటించారు. 17 లక్షల మంది సిబ్బంది ఈ బృహత్ కార్యాన్ని నిర్వ హించారు. ప్రపంచ జనాభాలో మన దేశం చైనా తరువాతి స్థానం ఆక్ర మిస్తోంది. ఈ లెక్కల ప్రకారం ప్రస్తుత మనదేశ జనాభా 84 కోట్ల 39 లక్షల 30 వేల 861. ఈ శతాబ్దాంతానికి ఈ సంఖ్య వందకోట్లు దాటవచ్చు. మన జనాభాలో పురుషులు 43,75,97,929 మంది కాగా, మహిళలు 40,63,32,932 మంది. 1981-91 దశాబ్దకాలంలో 16 కోట్ల జనాభా పెరిగింది. ఆస్ట్రేలియా ఖండం జనాభా కంటె ఇది పదిరెట్లు ఎక్కువ. సంవత్సరానికొక ఆస్ట్రే లియా జనాభాని పెంచే అలవాటు యింకా అలాగే ఉంది. ఎటొచ్చి గత దశాబ్దంలో ఈ రేటు 24.66 శాతం కాగా, ఈసారి 23.50 శాతం మాత్రమే వుంది. అదొక్కటే సుగుణం. 1981లో వెయ్యి మంది పురుషులకు 934 మంది మహిళలు వుండగా 1991 నాటికి ఆ సంఖ్య 929కి తగ్గిపోయింది. అయితే కేరళ లో వెయ్యిమంది పురుషులకు 1040 మంది స్త్రీలున్నారు. కాగా చండీఘర్ లో అతి తక్కువగా 793 మంది మాత్రమే వున్నారు.....

(ప్రెస్ ఇన్‌ఫర్మేషన్ బ్యూరో

?

"Sampati gave all relevant information about Lanka and the exact spot where Seeta was kept captive. I want to know whether Hanuman himself offered to go as he was Rama Bhakta," asked Raghu.

"You should know that the distance between Lanka and the southern tip was estimated at one hundred yojanas and no Vanara excepting Angada was capable of covering that distance. Even Angada himself was doubtful whether he could successfully come back. At that juncture, Jambavant, the Elder, said to Angada, 'I know you can cover the distance not once or twice but many times. Even then, I dissuade you from undertaking this hazardous mission as you are the tap-root of the tree while the rest of us are branches," said Raghu's father.

"Oh, I see, he is the crown-prince to succeed to the throne of Sugreeva...."

"Exactly. The leader should not be exposed to that sort of risk. Jambavant asked Hanuman to undertake the journey as he was the most intelligent of Vanaras besides being the son of Vayu, the wind-god. From the top of Mahendragiri Hanuman flew towards Lanka with the velocity of wind," explained Raghu's Father.

---

Lectures on Telugu Studies by Prof G N Reddy. జియన్ రెడ్డి షష్టిపూర్తి అభినందన కమిటీ ప్రచురణ; కాపీలకు; సత్యశ్రీ పబ్లికేషన్స్, 4 నలందానగర్, తిరుపతి - 517 502.... వెల; రు 65-00.

ఆంగ్లరచన.... తెలుగుభాషలోని మొదటి పత్రిక 1835లో 'సత్యదూత' అనే పేరుతో బళ్ళారి నుంచి వెలువడిందని చాలామంది అంటుంటారు - అది కరెక్ట్ కాదు. 'సత్యదూత' అనే పత్రిక లేకపోలేదు. కాని, అది బళ్ళారి నుంచి, గాక, మద్రాసులోని 'ట్రాక్ట్ డిపో' నుంచి 1886 నవంబరులో వెలువడింది. ఇంగ్లీషు తెలుగుల, సంయుక్త ప్రచురణ. అంటే అందులోని మేటరు ఇంగ్లీషులోనూ వుండేది - అనువాదం తెలుగులోనూ వుండేది. చిన్నయసూరి తరువాత కాబట్టి శుద్ధ గ్రాధికం గాక సులభ గ్రాంధికం వాడేవారు. Messenger of Truth (సత్యదూత) ప్రప్రథమ సంచికలో 'MAN' అనే హెడ్డింగ్‌తో, Man is the last and most wonderful work of creation. 'God formed man of the dust of the ground and breathed into his nostrils the breath of life, and man became a living soul' దానికి తెలుగు తర్జుమా: 'మనుష్యుడు దేవుని సృష్టులలో కడపటి వాడును. ప్రధానుడును అయ్యున్నాడు. 'దేవుడైన యెహెూవా నేలయొక్క మంట చేత మనిషిని రూపించి, వానియొక్క నాసికా రంధ్రములోకి జీవమైన ఊపిరిని ఊపిరింపచేసి నందున మనిషి జీవాత్మ గలవాడాయెను'....

1838 - 1841 మధ్య కాలంలో మండిగల వెంకటరాయ శాస్త్రి సంపాదకులుగా, 'చెన్నపట్న పు వృత్తాంతిని' అనే పేరుతో ఒక వార పత్రిక మద్రాసు నుంచి వెలువడ్డట్టుగా బ్రౌన్ పేర్కొంటున్నారు. విశాఖపట్నం నుంచి గోడె జగ్గారావు కూడా 'వృత్తాంతిని' అను తెలుగు పత్రిక వెలువరించినట్లు ఆధారాలు కనిపిస్తున్నాయి.

1842 జూన్ 8వ తేదీన మద్రాసునుంచి ప్రథమ సంచిక వెలువరించిన 'వర్తమాన తరంగిణి' కి పబ్లిషర్: రహిమ్‌తుల్లా సాహెబ్; ఎడిటర్: పువ్వాడ వెంకట్రావు. ప్రతి గురువారం వెలువడేది పదేళ్ళపాటు.... 1885లో రైతు జనావళి

కోసమని ప్రత్యేకంగా 'శేద్యచంద్రిక' అనే పత్రిక ప్రారంభమయింది. దాని మొదటి సంచిక మీద ఈ విధంగా ఉన్నది : 'నంబరు 1 - శేద్యచంద్రికా - సర్కార్ ఆలీ ఆజ్ఞా - ప్రకారం - శేద్యుల యొక్క క్షేమం - నిమిత్తం - మునిషి మహమ్మదు ముష్తాక్ అహమ్మద్ మాలిక్ - కారఖ్ఖానా పునూన్, హాయిదరాబాద్ దఖన్‌గారు - చేసి వున్నారు - చాపఖ్ఖానా పునూన్ పత్తర్ గట్టీ - హాయిద్రాబాదు ముద్రాక్షర శాల యందు - ముద్రించి ప్రకటింపబడియె....' ఆ తీరున ప్రారంభమైన తెలుగు పత్రికా వ్యాసంగం ఈ నూరేళ్లలో ఎన్నో శిఖరాల నధిరోహించింది.

ద్రావిడ సంతతి భాషలలో తెలుగు, తమిళ, కన్నడ, మళయాళమే గాక మరొక 18 భాషలు వున్నాయి. తెలుగు అక్షరాలు, మన ప్రాచీన శాసనాల నుంచి రూపం దాల్చాయి. శాసనాలు రెండురకాలు - తామ్ర (రాగి), శిల. మనకు తెలిసిన మొదటి తెలుగు శాసనం 6వ శతాబ్ది నాటిది. పాలించే ప్రభువులు దేవాలయాలకిచ్చిన భూములు, యితర దాన ధర్మాలు యుద్ధ విజయాల ప్రసక్తి ఈ శాసనాలలో ఉండేది.

సిపి బ్రౌన్ రెండు వేళ తాళపత్ర గ్రంథాలు సేకరించడమేగాక వాటిని సంస్కరింపజేసి అచ్చుకి అనుకూల పరిచాడు. 1300 పేజీల 'తెలుగు – ఇంగ్లీషు డిక్షనరీని 1853లో పబ్లిష్ చేశాడు. విల్సన్ సహాయంతో బ్రిటిష్ మ్యూజియమ్‌లోని తెలుగు పుస్తకాల కేటలాగ్ తయారు చేయించాడు. తన అమూల్య సేకరణని, మద్రాసు ఓరియంటల్ మానుస్క్రిప్ట్స్ లైబ్రరీకి వొప్పగించాడు. 17 ఏళ్లు మద్రాసు ప్రభుత్వంలో పారసీక దుబాసిగా పని చేసిన సిపి బ్రౌన్ ఉద్యోగ విరమణ గావించి, ఇంగ్లండు వెళ్లాక కూడా ముప్ఫయ్యేళ్ల పాటు, తన తుది శ్వాస దాకా (డిసెంబరు 1884), తెలుగు భాషోన్నతికి నిర్విరామ కృషి జరిపిన మహానుభావుడు, విద్యావికాసాలు లేనిదే మనిషి ముందడుగు వేయలేడని త్రికరణ శద్ధిగా నమ్మి, తను పని చేసిన ప్రాంతంలోని ప్రజల భాషాధ్యయనానికై సమస్తం అర్పించిన దీక్షా దక్షుడాయన.

1886 లో వియన్నాలో జరిగిన ఓరియంటల్ కాంగ్రెస్ సూచనల ననుసరించి భారత ప్రభుత్వం 'లింగ్విస్టిక్ సర్వే'కి పూనుకుంది. 1903-1928 మధ్యకాలంలో గ్రీర్సన్ తన 20 సంపుటాల గ్రంథంలో భారత దేశంలో 231 భాషలు, 774 మాండలీకాలు వున్న నిర్ణయానికి వచ్చి, చివరికి వాటిని 177 భాషలుగా 544 మాండలీకాలుగా నిర్ణయించాడు.

కొలిన్ మెకంజీ (1734-1821) మొట్టమొదటి సర్వేయర్ జనరల్‌గా పనిచేస్తూ వివిధ భాషలలోని 1568 తాళపత్ర గ్రంథాలను వెలికి తెచ్చాడు. ఒక్కో ప్రాంతాన్ని జిల్లాలుగా, తాలూకాలు (ఫిర్కాలు, మండలాలు),

గ్రామాలుగా విభజించి ఎల్లలు నిర్ణయించి, విస్తీర్ణం లెక్కగట్టి ఊళ్ల పేర్లు ధృవీకరించి, క్రోడి కరించ రిజిస్టర్లు తయారుచేయడమనే బృహత్ కార్యక్రమ నిర్వహణ 18, 19 శతాబ్దులలో జరిగింది. మనది ద్రవిడ సంస్కృతికి చెందిన ప్రాంతమవడం వల్ల ప్రతి తెలుగు గ్రామంలోను, శివుడూ విష్ణువుగాక విడిగా వేరే ఒకదేవుడో ఒక అమ్మవారో ఉంటారు.

ఆలయంలోనో, మందిరంలోనో మధ్యాహ్నం పూట, అంటే రెండూ రెండున్నర నుంచి చీకటి పడే దాకా, పుణ్యం పురుషార్థంగా పురాణ కథలు చెప్పేవారిని పౌరాణికులు అనేవారు. సంస్కృతమూ తెలుగు మిశ్రితం చేసి, ఒక్కోసారి వచనాన్ని కూడా రాగయుక్తంగా సాగదీసి, శ్రావ్యంగా కథ చెప్పే వారు ఈ పౌరాణికులు. తెలుగువారికి రామాయణం ఎంతో యిష్టం. రామకథలో, వాల్మీకి చెప్పినదేగాక అవాల్మీకమైనవి కూడా అనేకం ఉన్నాయి. ఆంధ్ర వాల్మీకిగా ప్రసిద్ధి పొందారు, వావిలి కొలను సుబ్బారావు (1863-1939 శ్రీపాద రామాయణం, పుట్టపర్తి నారాయణాచార్యుల జనప్రియ రామాయణం, 17వ శతాబ్ది మొల్లరామాయణమే గాక, ఈ శతాబ్దిలో కవయిత్రులు వ్రాసిన సుభద్రా రామాయణం, సరస్వతీ రామాయణం, అధ్యాత్మ రామాయణం గాక, ముస్లిమ్ కవి ఉమార్ ఆలిషా కూడా రామాయణం రాశారు. అనేక రామాయణాలు వాల్మీకి మూలానికి భిన్నమైనవి; కాని, తమ పరిధిలో మెరుగులు దిద్దాయి.

ఇక, కృష్ణుని విషయం దగిరకొచ్చే సరికి, భారత కృష్ణుడు, రాజనీతిజ్ఞుడు, సర్వసమర్థుడు. అద్వైత సిద్ధాంతి,

అవతార పురుషు నిలా రూపకల్పన చేశాడాయన ను కవిత్రయంలోని తిక్కన. ఇక, ఆంధ్ర భాగవతంలోకి (పోతన) వచ్చేసరికి, చిలిపి చేష్టల బాలకృష్ణుడు, చీరెల దొంగ అయాడు ; గోపవనితలను వివస్త్రలు గావించాడు ; నారీ జన మానస చోరు డయాడు ; రుక్మిణిని ఎత్తు కొచ్చాడు. తిక్కనకు, పోతనకు మధ్య గల కాల ప్రభావమది.

16వ శతాబ్ది నాటి రాయలవారి ఆస్థానంలో శ్రీకృష్ణ దేవరాయ ప్రభువే కృష్ణుడు - దేవేరుల తగాదాలే 'పారిజాతా పహరణం' - సత్యభామ తన్నితే, 'అయ్యో, నీ మెత్తటి పాదం కందిందేమో !' అనగల ప్రబంధ నాయకుడయాడు కృష్ణుడు. ఇక, తంజావూరు, మధుర నాయక రాజుల కాలంలో, విష్ణు భక్తుడైన విజయ రాఘవ నాయకుని దర్బారులో, కృష్ణుడు దక్షిణ నాయకుడు. ఎన మండుగురు భార్యలూ అష్ట విధ నాయికలు. రాజగోపాల విలాసంతో కాముకుడైన మదన గోపాలుడయాడు. ముద్దు పళని రచించిన 'రాధికా సాంత్వనము'లో మేనత్త రాధ, కృష్ణునితో సుఖం అనుభవిస్తూ. ఇలా దేవి నిచ్చి పెళ్లిచేసి, ఆ ఒక్కరోజూ కూడాఆగలేక, కొత్త పెళ్లికూతురిని తప్పించి, తమ ఆ మంచం మీదకి వెళ్తుంది. అవతార పురుషుని పాత్రకు యింతకంటే అధ్వాన్న స్థితి ఏము న్నది ? తరువాత కవులు శృంగా రాన్ని భక్తితో ముడి పెట్టారు.

ఆధునిక తెలుగు సాహిత్యానికి వీరేశలింగం యుగకర్త. ఆరుగురు సభ్యులతో 1878లో వీరేశలింగం ప్రారంభించిన 'ది రాజమండ్రి సోషల్ రిఫార్మ్ అసోసియేషన్' నవశకానికి నాంది పలికింది సంఘ సంస్కరణోద్యమం నవ్యసాహిత్యో ద్యమం తెలుగుజాతి వికాసానికి దోవ చూసాయి. కందుకూరి వీరేశలింగం 1919 మే 27వ తేదీన ఎగ్మూరు (మద్రాసు)లోని 'వేదవిలాస్'లో ఒక మిత్రుని యింట దివంకతులయారు, ఎన్నో అడ్డంకులని ఎదుర్కొంటూ గుండెబలంతో పోరాడిన ధీరుడాయన

'విస్కాన్సిన్'లో ఉన్నత విద్య నభ్యసించి, ఇండియా వచ్చి, కొన్నాళ్లు మద్రాసులోను, ఆ తరువాత తిరుపతి వెంకటేశ్వర విశ్వవిద్యాలయంలోను పని చేసి, ఆ యూనివర్సిటీకి వైస్ ఛాన్సలరై, న్యాయపథాన, ఋజు మార్గాన నడిచి, ఆకస్మికంగా తనువు చాలించిన ప్రొఫెసర్ జియన్ రెడ్డి సాహితీలోకాన ఎందరెందరికో సన్ని హితులు, సన్మిత్రులు. ఈ పుస్తకం లోని వ్యాసాలూ, ఉపన్యాసాలూ ఎంతో లోతైనవీ, విలువైనవీను. మన భాష, మన సంస్కృతి, మన చరిత్ర, ఒక విధంగా మన పుట్టు పూర్వోత్తరాలని ఎంతో విశదంగా, విపులంగా తన జ్ఞాపకం తెలుగు వారికి మిగిల్చి వెళ్ళినట్టుగా, చెప్పారు జియన్ రెడ్డి.

—క్షీరసాగరమ్

సంక్షిప్త భాగాలు

# 'నా రాట్నచక్రం'

## తల్లాప్రగడ ప్రకాశరాయుడు

గాంధీ గారికి సత్యాగ్రహోద్యమం, నిర్మాణ కార్యక్రమం రెండు నేత్రాల వంటివి ; రెండూ పరస్పర ఆశ్రితాలు. రాజకీయ పదవులు ఆశించకుండా, గాంధీజమ్‌కి కట్టుబడి, నిర్మాణ కార్యక్రమానికి అంకితమైన 'మహానుభావులలో ప్రకాశరాయుడు గారొకరు.... వారి జీవిత గాథలోని సంక్షిప్త భాగాలివి.

9

దంపుడు బియ్యపు పని విరమించి నేను యింటికి వచ్చేశాను. కాని కాకినాడలో ఖాదీ కమిషన్ డైరెక్టరు, శ్రీరాఘవన్ (నన్ను ఖాదీ All India Boardలో పెట్టినవారే) నన్ను విడిచి పెట్టలేదు. నూతనంగా యేర్పడ్డ Khadi and Village Industries Commission యొక్క regular Serviceలో గాక దాని అధ్వర్యంలో జరుగుతూండిన 'గ్రామ స్వరాజ్య' కార్యక్రమంలో నా కతి ప్రియం, యిష్టం అయిన పని కల్పించారు. ఒక్కటే మాట ఆయన అన్నది - చీటి వ్రాసి పంపించారు "జీవితమంతా గాంధి నిర్మాణ ప్రణాళికకు అంకితమైన మీకు అదే Lineలో, చేయగలిగిన (ఓపికున్నంత వరకు) ఏదో పని ఉంటూనే ఉండాలి" అన్న శ్రీ రాఘవన్‌గారి మాటతో నా జీవితాన్ని సరిగా అంచనా వేసిన వారిలో ఒకరనుకొన్నాను. ఆయన నాకు పురమాయించిన కార్యం అచ్చంగా నాదే యన్నంత ఉపలాటం కలిగింది. ఏదోయింత మాసికభృతి కూడ కల్పించారు. నా రొట్టె నేతిలో పడ్డట్లయింది. ఇక శ్రీ కాకుళం, పొందూరు, అనకాపల్లి, విజయనగరం మొదలు గాగల ఆంధ్ర ఖాదీ ఉత్పత్తి కేంద్రాలకూ, వాటి శాఖలకూ నెలల వారీగా ఒకటే తిరుగుడు ! అప్పటికి నాకు 72 యేళ్లు దాటిన వయస్సు. సుమారు అదే కాలంలో నా రెండో కొడుకు రాజారాం హైదరాబాద్ State Bank of Indiaలో చేరి నాకేదో చెప్పి పోవడానికి గుంటూరు జిల్లా, రేపల్లె తాలూకాలోని ఒక ఖాదీ ఉత్పత్తి కేంద్రానికి (అదొక పల్లెగ్రామం) వచ్చాడు.

'ఇదేమి టిట్లా వచ్చావు, ఏమిటి విశేష' మంటిని. 'ఏమి లేదు. నీ వయస్సు మించి పోతోంది. నీ వింక జిల్లాలలో పడి తిరగలేవు. నేను ఉద్యోగంలో ప్రవేశించాను. ఆర్థికంగా కుటుంబాని కేమీా లోటుండ బోదు. అమ్మాయి యూనివర్సిటీలో చేరినా, ఆ ఖర్చు గూడ ఏదో విధంగా meet అవ గలుగుతాం. నీవీ పాటికి ఈ పని విర మించి వచ్చి యింటిపట్టున కూర్చో దగునని చెప్పడానికి వచ్చా' నన్నాడు. నా మీాద కుమారునికున్న Affectionకు గాను నాలో సంతోషం పొర్లి వచ్చినా, నే నతని సలహా కియ్య కొనలేదు. 'ఈ పర్యటనలు నన్నే మాత్రం కష్టపెట్టడం లేదు. నా వయస్సు మించిపోతున్నదనే ఆలో చనయే నాలో లేదు. అందరిలో నన్నే ఎన్నికచేసి శ్రీ రాఘవన్ ఈ పని నాపైన బెట్టారు. I must do justice to what is expected of me. ఎప్పుడు చేయలేకపోతే, అప్పుడే పని విరమించి వచ్చేస్తాను' అని రాజారాం ను ఒప్పించి పంపివేశాను. నన్ను చూడమన్నవన్నీ ఖాదీ ఉత్పత్తి కేంద్రాలే కావు. కొన్ని గ్రామోద్యోగ (పరిశ్రమల) సెంటర్లు. ఉదాహరణకు రాజమండ్రిలో ఖాదీ విక్రయశాల వేరు, చరఖా మున్నగు పరికరాల, కొండపల్లి బొమ్మలవంటి ఆటవస్తువుల తయారీ, అమ్మకాల పని వేరుగా నుండేవి. ఒకసారి నాతోపాటు రాఘవన్‌గారు కూడ అక్కడుండి, 'నూలు వడికే పరికరాలు, ఖాదీ ఉత్పత్తియే మనకు ముఖ్యమనుకోండి. ఈ బొమ్మలు, అంటే ఆటవస్తువుల అమ్మకం మన కెందుకనే అభిప్రాయం ప్రకాశరాయ డుకు ఉండవచ్చు' ననే రిమార్కు నవ్వుతూ, ఆ సమావేశంలోనే ఆయన చేశారు. నేను దర్శించిన వాటిలో ఖాదీ ఉత్పత్తి కేంద్రాలు, వాటి శాఖలు ముఖ్యమైనవి. అందులో ప్రాధాన్యత వహించినవి పొందూరు 'సన్న ఖాదీ' కేంద్రం; తుని, రేపల్లె దగ్గర బొబ్బర్లంక, కందుకూరు కేంద్రాలు. వీరు నాకు సన్నిహితులై నా రాక కోసం చూస్తుండేవారు. పొందూరు, పరిసరాలలోని ప్రత్తి పరిశుభ్రమైన ఏకుల తయారు, పెద్ద చక్రాల మీాద పన్నెండేండ్ల బాలికలు గూడ దారం వడికే పద్ధతి - యిదంతా చూచి తీరవలసిన దృశ్యం. పురాతన ఇండియాలోని ఖాదీ కళాభిజ్ఞత ఆ పొందూరు (శ్రీకాకుళం జిల్లా) పరి సరాలలో యిప్పటికిని నిలిచియుంది. గుంటూరు జిల్లా బొబ్బర్లంకలోని ఖాదీ పరిశ్రమ establishment (ఆఫీసు, గుమాస్తాలు, బంట్రోతులు) లేదు. ఒక్క మనిషి చేతి మీాదుగా పని యావత్తు చెప్పినట్లు జరిగింది. ఆయన ఇంగ్లీషు అక్షరం రాని వెనిగళ్ల నారా యణ గారు. పట్టణ నాగరికత యే కోశానా లేని గ్రామీణుడు, సామాన్య కర్షకుడు. ఖాదీ ఉత్పత్తి చేయించి లాభాలు గణిద్దామనే ఆలోచన కించిత్తు కూడా లేదు. ఈ చిన్న వ్యవసాయదారుని బుద్ధి ఉత్పత్తి మీాదికి మరలడం ఆశ్చర్యకరం. పోనీ

ఖాదీ ఉత్పత్తి చేయించమని శ్రీ నారాయణ గారిని ఎవరైన ప్రోత్సహించారా అంటే అదీ కనబడదు. పొలం దున్నడానికీ, రాట్నం త్రిప్పడానికీ గల సహజ సంబంధం, ఈ కాలపు కర్షకుల కెవ్వరికీ తెలియనట్లు ఆయనకు దానంతట అదే తెలియవచ్చింది. ఆశ్చర్యమే - కాని నిజమంతే! ఖాదీ డైరక్టరు శ్రీ రాఘవన్ గారు ప్రయాణ సౌకర్యం లేని వీరి బొబ్బర్లంక కేంద్రానికి స్వయంగా వచ్చి వీరి ప్రయత్నాన్ని పట్టుదలను అభినందించారు. అంతకు మునుపు నన్నూ, డాక్టరు వెంపటి సూర్యనారాయణ గార్నీ స్వయంగా దగ్గర వుండి బొబ్బర్లంకకు తీసుకొని వెళ్లారు నారాయణ గారు. ఆ నాడు సుమారు నూర్గురు గ్రామ స్త్రీలను రాట్నాల వద్ద కూర్చోబెట్టి సూత్రయజ్ఞ ప్రదర్శనం చూపించారు. చూపించడమంటే, ఒక వీధి వేడుకగా కాదు. వారందరు ఖద్దరుధారణ దీక్షితులన్నమాట. అదొక పెద్ద విశేషం. చోటు చాలక కొందరు స్త్రీలు ఎండలో కూర్చునే నూలు వడికారు. దీక్ష అంటే అది. ఆ దీక్ష యావత్తు శ్రీ నారాయణ గారిలో మూర్తిమంతమయింది. వారి కార్యక్రమంలో ఒక రకం ఎఱ్ఱజాతి పెద్ద తిరగళ్ల మీద ధాన్యం విసరి, మొక్కవోని బియ్యం తయారుచేసే పరిశ్రమ, ఒకటి; అహింసా మధువును తయారుచేసే తేనే పెట్టెల పరిశ్రమ కూడా ఉండేది - అంటే తేనేటీగలకు హింస కలిగించని సౌమ్య పద్ధతి. నా ఖాదీ కేంద్రాల పర్యవేక్షణలో శ్రీ నారాయణ గారి స్వయంచోదిత మహా

కార్యక్రమం ఆదర్శప్రాయంగా నాకు కనబడ్డది. ఆదర్శమంటే ఆదర్శమే - పుస్తక చదువులు నేర్వని పల్లెటూరి నారాయణ గారు గాంధీ యుద్యమం యొక్క పూర్ణ ప్రతీకాన్ని తన పరిసరాలలో చూపించాడు. ఇచ్చిన యేకులు, పుచ్చుకున్న విలపలు, వడికిన స్త్రీల పేరు, ఊరు లెక్క వ్రాయించుకోవడం తప్ప, అయనకొక ఆఫీసు, గుమాస్తాలేరు. ఆ పరిసరాల గ్రామీణులు ఆయన యింటిపేరు 'వెనిగళ్ల' మరచిపోయి ఏకుల నారాయణ గారని పిలిచేవారు. ఆయన అనారోగ్య కారణంగా అక్కడి పరిశ్రమ యిప్పుడు నిలిచిపోయింది. కాని శ్రీ నారాయణ గారు యిప్పటికిని సజీవులై యింటి పట్టునే కాలక్షేపం చేస్తున్నారు. ఇక్కడ నున్న తన కొడుకును, నన్ను చూడడానికి రెండు నెలల క్రితం హైదరాబాద్ వచ్చారు.

నేను పర్యవేక్షించిన తదితర గ్రామ స్వరాజ్య ఖాదీ ఉత్పత్తి కేంద్రాలలో తుని కేంద్రం, కందుకూరు కేంద్రం ముఖ్యమైనవి. తూర్పు, పశ్చిమ గోదావరి జిల్లాలలోను, విశాఖపట్నం జిల్లాలోను తుని సెంటర్‌కు 18 బ్రాంచీలున్నాయి. ఇందు కొన్నిటిది ఉత్పత్తి, కొన్నిటిది విక్రయం మాత్రమే. ఇంతపని ఆంధ్రదేశంలో మరెక్కడాలేదు. ఇదంతయు తుని కేంద్రానికి నిన్న మొన్నటి వరకు సెక్రటరీగానుండి, యిటీవల రిటైరైన శ్రీ వెంపరాల సీతారామమూర్తి గారి శ్రమ ఫలితం. ఆ కాలంలో నేను తుని వెడితే, సెక్రటరీ గారితో కలసి బ్రాంచీ లుండిన గ్రామాలను దర్శించడం నాకు నేత్రపర్వంగా నుండేది. వారి నాయకుడు శ్రీ సీతారామమూర్తి గారి పట్ల బ్రాంచీల మేనేజర్లు చూపే అనువర్తన, విధేయత, కర్తవ్యపాలన చూడగా నేను వెళ్ళి చేసేది ప ర్య వే క్ష ణ (Supervision) కాదని, వారి ఖాదీ నిష్ఠ (అంటే నిరాడంబర ప్రవర్తన) నుండి నా ప్రవర్తనను సరిదిద్దుకొనడమే యని అనిపించేది తుని కేంద్రం దినచర్య మున్ముందు కార్యకర్తల సామూహిక సూత్రయజ్ఞంతో ప్రారంభమయ్యేది. వారి 18 బ్రాంచీలలో కూడా అదే పద్ధతి అమలు జరిగేది. మరొక సంగతి, అప్పుడు రానిది యిప్పుడు గుర్తుకు వస్తోంది. శ్రీ రాఘవన్‌గారు కాకినాడలో డైరెక్టరుగా నున్నంత కాలంలో రోజూ ఆఫీసు మూసే పూర్వమో లేక మూసిన వెంటనేనో (జ్ఞాపకం లేదు) 45 నిమిషాలలో విధిగా రాఘవన్‌గారితో సహాకార్యకర్త లందరూ సామూహిక సూత్రయజ్ఞం జరిపే నియమమొకటి ఉండేది. నేనెందుకో వారి ఆఫీసుకు వెళ్ళినపుడు ఒకానొక కార్యకర్తను గూర్చి రాఘవన్ గారిని ప్రశ్నించాను. "ఫలానా కార్యకర్త మీ ఆఫీసుకు వచ్చిన తరువాత బాగా పని చేస్తున్నాడు కదా" అని. ఆఫీసు పనికేమి బాగానే వుంటుంది కాని, సూత్రయజ్ఞం పట్ల అతని అలక్ష్యం కొంత కనబడుతూంటుంది. ఎలాగు నంటే, సూత్రయజ్ఞం మౌనంగా చేసి,

మౌనంతో ముగించాలి. కాని యీాతడు యింటికి పోవాలని తొందరో యేమో తనపెట్టి రాట్నాన్ని పెద్ద చప్పుడు చేస్తూ మూసి వేయడం చూస్తుంటాను. అది మంచిపని కాదు కదా!" అన్నారు రాఘవన్‌గారు నాతో. శ్రీరాఘవన్ మొదటనే ఆఫీసరుగా ఖాదీ కమీషన్‌లో వచ్చిపడలేదు. ఉద్యోగానికి రాక పూర్వం కొంతకాలం గాంధీ ఆశ్రమంలో ఉండి గాంధితత్వాన్ని బోధపరచుకొన్న కార్యకర్త. కనుకనే మౌనంతో సూత్రయజ్ఞం చేయుటలోని మర్యాద ఆయనకు బోధపడ్డది.

నేనుండిన రాజమండ్రి గాంధీ జాతీయ విద్యాలయంలోను; తరువాత నేను పనిపెట్టుకొన్న ఆనంద 'నికేతన్' హరిజనాశ్రమంలోను, గోపన్నపాలెం గ్రామ సేవక విద్యాలయంలోను, తెనాలి డాక్టరుగారి యింట నా కోసం యేర్పడిన విద్యాలయం లోను; కొంత కాలం నాతో సంబంధముండిన 'గ్రామ స్వరాజ్య' ఖాదీ కేంద్రాలలోను సూత్ర యజ్ఞ సమయంలో మౌనమే పాటింప బడేది. సూత్రయజ్ఞంలోని పవిత్రత అదొక యజ్ఞంగా తలంపబడటం లోనే వుంది. మహాత్ముడే అన్నాడు;

'Every yard of yarn that I spin, reminds me of the poverty-stricken people of India who have no food to eat'' అని తన 'గీతా' ('అనాసక్తి యోగ') వ్యాఖ్యానంలో 'ఈ నాటి యిండియా ఆర్థిక స్థితిగతులను బట్టి 'యజ్ఞ' మంటె సూత్రయజ్ఞ మొక్కటే సరివచ్చే అర్థ' మని చెబుతాడాయన. దైవప్రార్థనలో కూడా నోటిమాటల కంటే, మేల్కొని యున్న మౌనమే ఈశ్వరుని చేరుతుంది. దాని మహిమను మన మహాత్ముడు అనుభవపూర్వకంగా తెలుసుకొన్నాడు ...గోపన్న పాలెపు గ్రామ సేవక విద్యా లయం ఒక సర్కారు సంస్థ. అక్కడి నుండి ఒక గుమస్తా వేరొక ఆఫీసుకు బదిలీ అవుతూ, తన వద్ద నున్న చర్ఖాను దాని మీద అయిష్టంతో విద్యా లయంలో విసరి పారవేసి పోయినాడు. ఆదుష్కృయయొక్క దెబ్బ ఎక్కడ తగులుతుందో అతనికి తెలియలేదు, పాపం ఇంకా ఈ నాటికి ఖాదీ ఉత్పత్తి వ్యాపార సరళిలో అమ్మకం, కొను గోలు కోసం యెడారిలో ఒయాసిస్ లాగు లింగు లిటుకు మంటూ అక్క డక్కడ కనబడుతూన్నా పై గుమా స్తాకు వలే దేశాని కది గిట్టని వస్తు వయిపోయింది. ఏ సందర్భంలో అన్నాడో కాని రాట్నాలన్నిటినీ నా చితిపై పేర్చి తగుల బెడతారని ఎప్పుడో మహాత్ముడే అని యుండిన మాట. లేక 'తగులబెడతారా ?' అన్నడా? ఇండియా మద్య నిషేధాన్ని ఎత్తివేసినట్లే రాట్నాన్నిగూడా తొలగించినట్లే అయింది ! ఇక దొంగ వ్యాపారస్థుల దౌర్జన్యాన్ని గూర్చి ఒక్క మాట— గట్టిదైన సన్నని మిల్లు నూలు పొందూరు పేరుతో బొంబాయిలో అమ్ముడయ్యేదట. ఈ మోసాన్ని కనిపెట్టి అప్పటి ఆంధ్ర ఖాదీ డైరెక్టరు శ్రీ పి.వి. రాఘవన్ గారు రాట్నం మీద నూలు వడికే పద్ధతిలో ఒక ఫక్కీ ప్రవేశపెట్టారు. మిల్లు దారపు పురి కాకుండా రాట్నం కదురు వద్ద తద్భిన్న మగు ఎదురు పురి (twist) యేర్పాటు చేశారు. ఇప్పటికి ఆ నూతన విధానం కొనసాగుతోంది. ఆయన వంద నీయుడు. అయినా మోసగాళ్ళ కెప్పుడూ బోటుంటూనే వుంటుంది. వాళ్ళదే ఈ ప్రపంచం ! రాఘవన్ మహాశయుడు బొంబాయి కేంద్ర ఆఫీసరుగా రిటైరయి ఇప్పుడెక్కడ నున్నారో !

1910 ప్రాంతంలోనని జ్ఞాపకం- ఒక త్రివిధ కార్యక్రమాన్ని ప్రతి పాదించి దానిని అమలుపరచమని చెప్పి అ. భా. ఖాదీ గ్రామోద్యోగ కమిషన్‌కు అప్పగించాడు శ్రీ సంత్ వినోబా. అప్పటికి నేను చేస్తూ వుండిన 'గ్రామ స్వరాజ్య' ఖాదీ సంఘాల పర్యవేక్షణతో పాటో, లేక ఆ పని అయిన తరువాత వేరే పని గానో, శ్రీ వినోబా సూచిత నూతన ప్రణాళికా ప్రచారకుడుగా నన్నే ఏర్పాటు చేశారు శ్రీ రాఘవన్‌గారు. పనులు పైకి వేర్వేరైనా 1921 మొదలు గాంధి నిర్మాణ కార్య

ప్రచారకుడనియే నాకు సేవ పెట్టుకొన్న పేరు. నాకు మిగిలియున్న స్వల్ప శారీరక శక్తితో యిప్పటికిని అదే నా పేరు, వాంఛ కూడా... ఖాదీ, శాంతిసేన, గ్రామదానాలు త్రివిధాలుగా కనబడ్డా, ఒకే ఉద్యమం యొక్క త్రిముఖాలు అవి.

ఇండియా అంటే అందలి ఏడు లక్షల గ్రామాలలోని ప్రజానీకమే. అందు నూటికి 80 కుటుంబాలు సేద్యం వల్ల జీవిస్తున్నారు. ఈ దేశంలో నిరుద్యోగమంటే చాలినంతగా అన్న వస్త్రాలు లేని సోమరితనం.

ఇందువల్ల ఆర్థికం, అంతకు మిక్కిలిగా నైతికం అయిన దారిద్ర్యం జాతిని ఆవహించింది. పాలకులు ప్రజల మానప్రాణాలను తమ గుప్పిట పెట్టుకొని, క్రూరపద్ధతుల నవలంబించారు.

1921 ప్రారంభదినాలకే ఆసేతు హిమాచలం పల్లె పల్లెకూ వ్యాపించిన శాంతియుత సహాయ నిరాకరణోద్యమానికి సూత్ర యజ్ఞం, ఖద్దరు ఉత్పత్తి, ఖద్దరు ధారణ, విదేశ వస్త్ర దహనం నాంది అయినాయి. ఉప్పుమారంభించినకే అత్యానందాలు పొడమి, ఆకాశవాణి యన్నట్లు 'S[illegible] in one y...'' అనే ఒక్క ధ్వని ఆకాశమంటింది. ఏ దేశం లోనూ ఏ రాజశాసనం ఇంత వాయువేగంతో ఈ విధంగా జాతి హృదయాన్ని ఆకర్షించి యుండలేదు. ఆ నాటి మహావిప్లవాన్ని కండ్లార చూచిన వాడను కనుక స్వయంపోషక సాధనమైన, నూలు వడికే 5 అంగుళాల కదురు గాంధీ విప్లవానికి ప్రాతిపదిక కావడంలో ఆశ్చర్యం లేదు. ఏలనంటే శాంతియుతమైన స్వధర్మ నిర్వహణ అందలి విశిష్టత. పీడిత ప్రజానీకం కష్టాలను భరించి బాపుకొనడానికి గాను శాంతియుతంగా శత్రువు నెదుర్కొని నిలవడాన్ని మించిన విప్లవం ఉభయ తారక మయింది. ఈ కీలకాన్ని ఎక్కడ పట్టుకున్నాడతడు? దానికి 'సత్యాగ్రహం' అని

## మనవి

మీరు విన్నవీ మీ అనుభవంలో వున్నవీ పదిమందికి చెబితే బావుంటా యనుకొనే 'జోక్స్', నిమ్మతొనలు శీర్షికలో ప్రచురింపబడతాయి. ఈ పత్రికకు సంబంధించిన సూచనలకు, విమర్శలకు 'పాఠకుల తీర్పు'. ఈ పత్రికలో వెలువడేవన్నీ మా అంతట మేము కోరి వ్రాయించేవి - అంచేత, ప్రచురణ నిమిత్తం వ్యాసాలూ, కథలూ, కవితలూ పంపవద్దు. ఎప్పుడైనా అవసరమైతే, మేమే అడుగుతాము ... చందా 24 సంచికలకు : ఏభై రూపాయిలు.

JAGATI - 2, Kutchery Road, P.B. 2922, Mylapore, Madras-600004.

ప్రియమైన పేరు పెట్టుకున్నాడు జాతియొక్క ఆత్మగౌరవాన్ని జీవనాధారాన్నీ అపహరించిన విదేశీ వస్త్రాలను తగులబెట్టడమే 'religious duty' అన్నాడు. "In burning my foreign clothes I burn my shame" అనడంలో ఒక ధర్మ సూక్ష్మం యిమిడి యుంది. సత్యాగ్రహాన్ని గాంధికి నేర్పింది అతని లోపలి ఆత్మసాక్షియే. ఇందుకు బయటి గురుబోధలతో పనిలేదు. అట్టి ప్రత్యక్ష ఆదర్శమూర్తులకు గూడా ఈ దేశంలో కొరత లేదు. ప్రపంచానికే ప్రథమగురువు ప్రహ్లదుడు. ఇంకా వున్నారు వసిష్ట, హరిశ్చంద్రాదులు. ఆవరుసలో చివర మనకు తెలిన వాడు మన మహాత్ముడు. మహాత్ముడు మనలను కటికి చీకట్లో పారవేసి పోయిన 1948 జనవరి 30 వ తేదీ ఉదయం పూట కూడా అతని చేతిలో చర్ఖా తిరిగే యుంటుంది. నిస్సందేహం. వందలాది గాంధీ చిత్ర పటాలను, వీధుల్లో ఱాతి బొమ్మలను మనం చూస్తుంటాం. కాని రాట్నం మీద నూలు వడుకుతున్న గాంధియే నాకు అసలైన గాంధి.

ఈ విధంగా శ్రీ రాఘవన్‌గారు నాకప్పగించిన శ్రీ వినోబా త్రివిధ కార్యక్రమ ప్రచారం ఆంధ్ర జిల్లాలలోని గ్రామ స్వరాజ్య సంఘాల సమావేశాల్లోను తదభిమానులగు ఆయా గ్రామవాసుల ప్రత్యేక సభల్లోను యథావిధిగా సాగించిన కృతార్థుడను. ఈ కార్యం నాకు పురమాయించిన ఖాదీ కమిషన్ పెద్దలపట్ల కృతజ్ఞుడను అయినాను. అంతకు పూర్వం నేను వీక్షించుచుండిన గ్రామస్వరాజ్య సంఘాల స్థితిగతులను గూర్చియు, తదుపరి (ఆ తర్వాతనే యని జ్ఞాపకం) శ్రీ వినోబా త్రిముఖ కార్యక్రమ ప్రచారాన్ని గూర్చియు నివేదికలు వ్రాసి ఖాదీ కమిషన్ ఆఫీసువారికి పంపుతూండే వాడను. వాటిని డైరెక్టరు శ్రీ రాఘవన్‌గారు కూడా చూస్తూవుండిరేమో! ఆ యాఫీసులోని శ్రీ సుందరంగారు (పెద్ద ఆఫీసరూ కాదు, కేవలం, గుమాస్తా కాదు) నా రిపోర్ట్లను చదివి 'ప్రకాశరాయడూ, మీ రచనలు ఏవోనవలలలాగు చాలా interesting గా వుంటా'యని నాతో అనేవారు. 'అట్లాగునా, అయితే అవి నా నిత్యానుభవంతో గూడిన నిజాన్ని చెప్పే నవలల' ని జవాబిచ్చేవాణ్ణి.

శ్రీ వినోబా కార్యక్రమంపేర నా కప్పగించిన ప్రచారంలోని రెండో విషయం 'శాంతిసేన' దీని ఆలోచన మహాత్ముని మనస్సులో ఎప్పుడూ ఉంటూనే యుండెను. కాని దాని కొక ప్రత్యక్ష రూప మిచ్చి గాంధీ వినోబాలు దేశవ్యాప్తంగా అమలు జరిగించినట్లు నా గుర్తులో లేదు. భారతదేశంలో ఖాదీ యుత్పత్తి, ఖాదీ ధారణ వలెనే పెద్ద యెత్తున శాంతిసైనిక బృందాలను ఎక్కడికక్కడ నెలకొల్పడం కూడ ఒక యుద్యమ రూపం దాల్చాలని ఏనాడో మహాత్ముడిచ్చిన సందేశం....

దేశానికొక విధమైన స్వేచ్ఛ (రాజకీయ స్వేచ్ఛ) లభించింది. ఎవరో కొందరు నిర్ణయించు కొన్న రాజ్యాంగ విధాన పరంగా దేశ పరిపాలన జరుగుతోంది. కోట్లాది డబ్బుతో ప్రణాళికా కార్యాలు జరుపుతున్నారు. సర్కారు లెక్కల ప్రకారం దేశంలో ఆహార ధాన్యాల పంట పెరిగింది. విద్యుచ్ఛక్తి సరఫరా, పోస్టాఫీసులు, రోడ్డురవాణా సౌకర్యాలు వృద్ధి చెందాయి. ప్రపంచ పెద్ద రాజ్యాలనబడే అమెరికా, రష్యా, చైనా, మున్నగునవి శత్రుకూటాలుగా చీలి పరస్పర వినాశానికి పన్నాగాలు పన్నుతూన్నా, ఇండియా తానే కూటం లోనూ చేరక అన్నిటి యెడలను తన మైత్రిని ప్రకటిస్తూ కాలం గడుపుతోంది. అయినా ఇప్పటి కింకా ప్రజలకు కావలసిన కనీసపు మనశ్శాంతి, మనోబలం ఈ దేశంలో కనబడటం లేదు. గ్రామ పునర్నిర్మాణ పథకాన్ని అక్షరాలా అమలు జరుపుతామని ప్రమాణాలు చేసి అందుకు విరుద్ధంగా సంచరించే మన ప్రభుత్వ సభ్యులు, దిన దినం పెరుగుతూన్న ఈ అశాంతికి ఒక ముఖ్యకారణం. పదవీ వ్యామోహితులగు స్వార్థపరులను శాసనసభలకు పంపించే మూర్ఖ ప్రజానీకం వల్ల కలుగుతూన్న దేశారిష్టం చెప్పరానంతగా ఉంది. ఇందువల్ల "పృధ్వీశాంతి, అంతరిక్షం శాంతి, శాంతిరాపః, శాంతిరోషధయః" ఎప్పటికైనా వస్తుందా? "Ours is fundamentally a movement of self-purification... My non-violent non-cooperation is, in essence, the enlightened expression of anguished love for the wrong-doer... The power of nonviolence must be demonstrated to the full and to the finish'' అంటాడు గాంధి. శివమెత్తినట్లు జుట్లు పట్టుకొని పీకలు నులుముకొనే శాసన సభల తదితర పాలక సంస్థల ఎన్నికలలో జరిగే మృత్యు నృత్యాన్ని పట్టి చూస్తే శాంతి అశాంతుల వ్యత్యాసం వాటి ముఖం మీదనే వ్యక్తమవుతోంది. నైతిక విలువలను నాశనంచేసే ప్రయోగాలను పథకాలను గాంధీ ధర్మశాస్త్రం హర్షించదు, మన్నించదు. స్వార్థరాహిత్యమే మైత్రిని పెంచుతుంది. If ye love them who love you, what do ye more than others. Be ye therefore perfect even as your father in heaven is perfect. No man can serve two masters. God and Mammon - అని మహానుభావుల హెచ్చరిక.

శాంతి సైనికుని యోగ్యతలు కొన్నిటిని విశదపరచాడు గాంధీ. 1. శాంతి సైనికునికి అహింస యందు, ఈశ్వరుని యందు, పూర్ణమైన విశ్వాసం శముడవలె 2. శాంతిదూతకు ప్రపంచ ప్రధాన మత ధర్మాలన్నిటి యందు సమాన గౌరవ ముండవలె. అన్నిమత సిద్ధాంతాల పరిచయం, అనుభవ జ్ఞానం కూడ ఉండవలె 3. ఒకరొకరు

గను, కొందరు జట్టుగా నేర్పడి కూడ, శాంతి స్థాపన చేయవచ్చు. సహచరులు దొరికే వరకు శాంతి సాధకుడు వేచి యుండ నక్కరలేదు. 4. శాంతి సాధన సాధారణంగా స్వస్థలాలలో స్థానికుల చేతనే జరుపబడవలె. 5. శాంతి సైనికుడు తన సేవ మూలమున తన క్షేత్రంలోని ప్రజల కందరికిని సుపరిచితుడై యుండవలె. 6 నిష్కల్మషమైన శీలము, నిష్పాక్షిక బుద్ధి, శాంతి సైనికునికి కవచంగా పని చేస్తాయి. 7. రాబోవు తుఫాను సూచనలు కనబడి మంటలు లేచే వరకు శాంతి సాధకుడు చూస్తూ ఊరకుండడు. 8. శాంతి యుద్యమం పేరిట యావత్కాల సేవకులు కొందరు నిలువలో నుండటం అవసరం. అయినా వారు కూడ అనుక్షణం ఆ పని మీదనే కూర్చోవలననే నిర్బంధం లేదు కాని అవసరం వచ్చిన తక్షణం అందుకు సంసిద్ధులయ్యే సచ్చరిత్రులగు స్త్రీ పురుషులు గ్రామంలో ఎందరుంటే అంత మేలు. 9. శాంతి సైనికులుగ గుర్తింప బడుటకు వారు ఒకే రకమైన దుస్తులు ధరించటం మంచిది. 10. సేవా కార్యానికి కావలసిన ఆరోగ్యం, బలం, అవకాశం (అనగా సమయం) కలవారందరూ ఇందుకు కృషిచేస్తారు. 11. తానెప్పుడూ శాంతి శిక్షణలో విద్యార్థిగ నుండగల వినమ్రతను శాంతి సైనికుడు సంపాదించవలె. స్వానుభవం, స్వీయ శిక్షణ వంటి గురువు వేరొకరు లేరు. 12. తానొక నాయకుడననే భ్రమకు శాంతి సైనికుడు లోనుగా కూడదు. అతని స్వీయ జీవితమే ఇతరులకు ప్రత్యక్ష నిదర్శనముగా గోచరించాలి. 13. శాంత సైనికుని లక్ష్యం ఎంత మటుకు దీనులు, దరిద్రులు, పతితుల మీదనే కేంద్రీకరింప బడవలె. 14. అయినప్పుడూ, కానప్పుడూ శాంతి సైనికుడు తానధికంగా మాట్లాడక మౌనధారియై యుండవలె. ధర్మ నిరూపణ అవశ్యక మైనప్పుడు శాంతి దూత నిర్భయుడై భగవదా దేశంగా సత్య ప్రకటన చేయ వలె. 15. పది మంది చేరిన చోట హెచ్చు తగ్గులు పాటించని స్నేహ భావాన్ని నిరాటంకంగా ఎవరి మాట వారు చెప్పుకోగల స్వతంత్ర వాతావరణాన్ని శాంతి సైనికుడు కల్పించాలి. 16. సేవా మార్గంలో ఎదురయ్యే కష్ట నిష్ఠూరాలను సహిస్తూ తన ఇబ్బందులను ఇతరుల సుఖానికి వినియోగ పరచాలి. జిహ్వా చాపల్యాన్ని జయించి, ఎక్కడ ఎంత దొరికితే దానితో కుక్షి నింపుకొని, కొలది పాటి దుస్తులతో కాలక్షేపం చేస్తూ విలాసాలను వర్జించి సామాన్య ప్రజానీకంతో కలసి మెలసి బ్రతకటం శాంతి సైనికుని లక్షణం.

(ఇంకా వుంది

గాంధీయ సమాజ సేవా సంస్థ (అవనిగడ్డ-522 123) సౌజన్యంతో ....పుస్తకం వెల : రు. 20-00.

## మే 31, 1992

మైలాపూర్ ఫైన్ ఆర్ట్స్ క్లబ్‌లో 'శంకరాభరణం' వారు, వేదవతీ ప్రభాకర్ మ్యూజిక్ ఏర్పాటు చేశారు. దేశవిదేశాలలో ఎంతో ప్రఖ్యాతి గాంచిన ఈ గాయనీమణి, తన కంఠ మాధుర్యానికి భావస్ఫూర్తి జోడించి శ్రోతలను గాన రసస్రవంతిలో తన్మయులు గావిస్తారు. పురందరదాసు, రామచరణం - మాకు శరణం (దేవులపల్లి), తమిళంలో ఒకటి, హిందీలో ఒకటి, మీరాభజన వంటివి పాడినా, ఎక్కువ సమయం అన్నమయ్యకే కేటాయించారు. గుండెని సూటిగా తాకే పదకవితలు, వాటి బాణీలూ, శ్రోతలను రంజింపజేశాయి. వేదవతీ ప్రభాకర్ చాలా బాగా పాడా రనడం, చక్కెర తియ్యగా ఉందని చెప్పడంలా ఉంటుంది.

## జూన్ 01, 1992

'సర్‌ప్రయిజ్ ఎలిమెంట్' కొన్నిటికి ప్రత్యేకతని, తళుకుని యిస్తుంది. 'యమ్మారెఫ్' మోహనరావు, ఏర్పాట్లన్నీ గుట్టుగా చేసి, ప్రతి ఒక్కరినీ యిది ముఖ్యవ్యక్తికి వెల్లడించ వద్దని కోరారు. సుమారు ఒక వంద మంది బంధువులూ స్నేహితులూ, చివరిదాకా మోహనరావు రహస్యం కాపాడ టంతో, ఏదో ఈ పూట వుడ్ లాండ్స్‌లో భోజనం అనుకున్నారు గాని, యిందరు తనని మభ్యపెట్టి తన 60 వ జన్మదినోత్సవం జరుపనున్నారని సరళా సూర్యారావుకి (మాజీ రాష్ట్రపతి గిరిగారి అమ్మాయి) తెలియదు. వుడ్‌లాండ్స్‌కి వచ్చి, అరేంజిమెంట్స్ చూశాక విస్తుపోయినా, అప్పుడిక చేయగలిగేదేముంటుంది, నవ్వుతూ ఆమోదించాలి గాని! అదే చేశారు సరళా సూర్యారావు.... మనుమడు అర్జున్, అమ్మమ్మ పుట్టిన రోజున ఆహూతులందరికీ, తన మాజిక్ విద్య చూపుతానన్నాడు. ఆ తర్వాత మరొక బుజ్జి మనుమడు తను కాన్వెంట్‌లో నేర్చుకున్న పాట పాడతానన్నాడు. అలాగే యిద్దరు ముగ్గురు బంధువులు 'బర్త్‌డే బేబీ'కి తమ పాటలతో శుభాకాంక్షలు తెలుపుతామన్నారు. మీరు మీ సీట్లోనుంచుని, మీ పేరు చెప్పుకోండనడంగాక, మోహనరావు ప్రతి ఒక్కరినీ, పేరు

పేరున, వారి వారి వృత్తి వ్యాపకాలు, బంధుత్వాలు, స్నేహాను బంధాలతో పరిచయం చేస్తూంటే, అక్కడ చేరిన అందరికీ తామొక విస్తృత కుటుంబ సభ్యులమనే భావం కలిగింది. అందరూ మన వాళ్ళే, మనకి కావలసిన వాళ్ళే, మనకు తెలిసిన వాళ్ళే - ఆ ఫీలింగ్, ఆ పట్టుకుచ్చుల పటిమ, ఈనాటి విందుకి కొత్త రుచుల నిచ్చింది. నా పక్కన కూచున్నాయన 'అడిసన్స్'లో ఉన్నతోద్యోగి మాటల సందర్భంగా, "మా 'అడిసన్స్' గ్రూపులో, ఫామిలీస్‌తో సహా ఏభై వేల మందికి డిన్నర్ యివ్వవలసి వచ్చింది. ఒక్కో తడవ వెయ్యి మందికని కేటాయించి, కొన్ని వారాలపాటు ఈ వుడ్‌లాండ్స్‌కి పంపాము; వీరు రోజుకి 750 లేక 1000 మించి పెట్టలేమన్నారు. ఏమైనా మనలాటి వారందరకీ వుడ్‌లాండ్స్ బెస్ట్ .... మీరు కచేరీరోడ్, నేను కేశవ పెరుమాళ్ - మళ్ళీ కలుసుకోవాలని మనం" — అన్నారాయన. కలుసుకో వచ్చు, కలుసుకో లేక పోవచ్చు. కాని, ఈ జ్ఞాపకం చెరగదుగా.... మో హ న రా వు కి కంగ్రాట్స్, సరళా సూర్యారావుకి జన్మదిన శుభాకాంక్షలు తెలిపి, మళ్ళీ సంవత్సరం మర్చిపోవద్దని చెప్పి మరీ వచ్చాము .... ఇందాక హాలులో ప్రవేశించగానే 'ప్రతి నెలా మమ్మల్ని మీ వెంట తీసుకు వెళ్తున్నారు మీ డైరీతో' - అని కాంప్లిమెంట్ చేశారు వీణా చిట్టిబాబు. రసజ్ఞులను మెప్పించడం కంటె రచనకు పరమావధి ఏమున్నది?

. . . . . 02

"మనందరం 'రియొ డి జెనరొ కాన్ఫరెన్స్‌కి వెళ్లడం సాధ్యం కాదు - కనీసం, పర్యావరణ సమస్యా స్వరూపం, ఐక్యరాజ్య సమితి ఏర్పాటు చేసిన ఈ 'ఎర్త్ - సమిట్'లో ఏ ఏ విషయాలు చర్చింపనున్నారో 'వరల్డ్ నెట్‌వర్క్' ద్వారా తెలుసుకుందాం" — అదీ అమెరికా సమాచారశాఖ డిప్యూటీ డైరక్టరు జేమ్స్ మూర్, ఇన్విటేషన్ లెటరులోని ఆఖరు వాక్యం... ఈ నాటి వరల్డ్ నెట్‌వర్క్‌లో బంగ్లాదేశ్ నుంచి, పాకిస్తాన్ నుంచి, యిక్కడ మద్రాసు నుంచి క్రిస్టియన్ కాలేజీ ప్రొఫెసరు దయానందన్, 'సి యల్ ఆర్ ఐ'లో పర్యావరణ శాఖాధిపతి డాక్టర్ మరియప్పన్ పాల్గొన్నారు. మద్రాసు నుంచి ప్రశ్నిస్తున్న వారు మన కెదురుగా కనిపిస్తారు; బంగ్లాదేశ్, పాకిస్తాన్‌ల నుంచి ప్రశ్నించే వారి కంఠాలు మాత్రమే వినిపిస్తాయి. వాషింగ్టన్ నుంచి ఈ ప్రశ్నలకు పాటీ పెటిష్, ఇర్విన్ స్టెల్జర్ మనకు విడియో తెరపై కనిపిస్తూ సమాధానాలు చెబుతారు (ఈ ఏర్పాటంతా సాటిలైట్ ద్వారా సరిగ్గా సాయంత్రం అయిదుగంటల ముప్పయి నిముషాలకు).... పరిశ్రమల కోసం అడవులు నరకటం, వాతావరణ కాలుష్యం, ముందు తరాల వారి క్షేమం ఆలోచించకుండా భూసంప

దనీ, భూసారాన్నీ ధ్వంసం చేయడం - యిలాటివన్నీ చర్చించి ప్రజా శ్రేయస్సు దృష్ట్యా కొన్ని నిర్ణయాలు తీసుకొనేందుకు ఐక్య రాజ్య సమితి, బ్రెజిల్‌లోని 'రియొ డి జనిరో' నగరంలో బృహ సమావేశం ఈ నెల 3వ తేది నుంచి 14వ తేదీ దాకా నిర్వహిస్తోంది. నూరు దేశాల ప్రధానులూ, ప్రెసిడెంట్లూ, పెద్దలూ, విజ్ఞాన మూర్తులూ ప్రజా హితైషులూ యిందులో పాల్గొన్నారు - ఆ నేపథ్యంలో ఈ నాటి వరల్డ్ నెట్ వర్క్ .. ఈ మధ్యాహ్నమే అమెరికా అధ్యక్షుడు బుష్, ప్రపంచ పర్యావరణ రక్షణ నిమిత్తం అమెరికా 50 కోట్ల డాలర్లు యివ్వనున్నదని ప్రకటించారు.. ఉత్తర దక్షిణాలు, అభివృద్ధి చెందిన దేశాలు, చెందుతున్న దేశాలు, జనాభా పెరుగుదలకు వాతావరణ కాలుష్యానికి గల సంబంధం యిలాటి లెన్నో ప్రశ్నావళిలో వచ్చాయి. పారిశ్రామిక దేశాలు బాధ్యతారహితంగా ప్రవర్తిస్తున్నాయనీ ఐక్య రాజ్య సమితి తగు కట్టు దిట్టాలు చేయాలనీ అన్నారు ఇర్విన్, 5 శాతం జనాబా గలదేశం, ప్రపంచ సంపదలో 25 శాతం తన గుప్పెట్లో పెట్టుకోవడం వల్ల ఏ మంచీపనీ నిర్వో

ఘ్నంగా నెరవేరడం లేదనీ, ప్రకృతి వనరులు విపరీతంగా, దుర్వినియోగ మవడం, జనాభాని, కట్టడిలో వుంచ లేక పోతున్న 'డెవలపింగ్ నేషన్స్' లోనే అధికమనీ అన్నారు పాటీ పెటీష్. 'జనరేషన్ గాప్' గురించి ఆమె మాటల సందర్భంగా అన్న ప్పుడు, ఆ 'గాప్' వేష భాషలకు చెందుతుందే తప్ప సహజ నైజాన్ని ప్రకృతినీ మార్చదని సరిదిద్దారు అను భవజ్ఞులైన ఇర్విన్. 'కార్బన్ డై అక్స యిడ్' శాతం చుట్టూ వాతావరణంలో పెరగడం వల్ల ఏర్పడుతున్న 'గ్లోబల్ వార్మింగ్'ని (భూమండల ఉష్ణోగ్రత అధికమవడాన్ని) అరికట్టక పోతే, అది ఆయా దేశాల సమస్యగాక భూలోక వాసులకే విపత్కర పరిస్థితి ఏర్పడుతుందని హెచ్చరించారు ఇర్విన్.

. . . . . 04

"తెలుగు వారికీ, తమిళులకి గల మైత్రి, వేలాది సంవత్సరాల చరిత్రలో వేళ్ల పాతుకునివుంది. ఈ మైత్రీ బంధం నుంచే మన దాక్షిణాత్య కళలు, సంస్కృతి, సాహిత్యం, సంగీత నాట్యాదులు, జీవన పద్ధతీ జన్మించాయి; సాంఘిక బంధాలను పటిష్టం చేశాయి.... హైదరాబాదు ఎప్పుడూ నాకు 'మా యిల్లు' లాటిది - మరొక రాష్ట్రమనే తలపు రాదు. రాజకీయంగా, సాంఘికంగా అనేక శతాబ్దులుగా మనం ఒకరం. సోదర భావమూ, సాన్నిహిత్యం, పరస్పర సహకారమూ మన బాంధవ్యలతలు, రాష్ట్రాల మధ్య నుండవలసిన సద్భా వానికి, సచ్చింతనకు మనని ఆదర్శ ప్రాయంగా చెప్పుకోవచ్చు.. పోయిన సంవత్సరం (1991) ఆంధ్ర ముఖ్య మంత్రి జనార్దన రెడ్డిగారు, ఏదో స్వంత పని మీద మద్రాసు వచ్చారు. అప్పుడు మేము కలుసుకున్నప్పుడు, మాటల సందర్భంగా తమిళనాడు, ఎలక్ట్రిసిటీ బోర్డుకి బొగ్గు నిల్వలులేక పోవటం వల్ల ఏర్పడనున్న క్లిష్ట సమస్య గురించిన ప్రస్తావన వచ్చింది. వెంటనే ఆయన 'మీరేమో దిగులు పడకండి - ఆంధ్రా నుంచి లక్ష టన్నుల బొగ్గు పంపిస్తాను' - అన్నారు, పంపించారు; ఆ విధంగా విద్యుత్ కొరత ఏర్పడకుండా ఆదు కున్నారు. అలాగే, ఆంధ్రాకు అవసర మైన పోలీసు బలగంతో, తమిళనాడు ప్రభుత్వమూ ఆదుకుంది... మనం ఏకోదరులం - ఒక తల్లి పిల్లలం" - అన్నారు తమిళనాడు ముఖ్యమంత్రి విప్లవ నాయకురాలు జయలలిత, యూనివర్సిటీ సెంటినరీ హాలులో, తెలుగు పీపుల్స్ ఫెడరేషన్ ఏర్పాటు చేసిన 'అంగీరస ఉగాది ఉత్సవ' సందర్భంగా.... "మీరం దరూ ఆమెని 'పురట్చి తలైవి', విప్లవ నాయకురాలు, అంటున్నారు. కాని, నేను ఆమెని వీరనారి అంటాను ....1994 ముగిసేలోగా మద్రాసు నగరానికి కృష్ణా జలాలు వచ్చేటట్టు చేస్తాననీ, అవ్వో సావ్వో చేసి మాట నిలబెట్టుకుంటామనీ చెప్పాను. ఆమెని

చూసినప్పుడల్లా నాకు ఆ తొంభయి నాలుగే గుర్తు కొస్తుంది.... భాషా రాష్ట్రాలు పాలనా సౌలభ్యం కోసం ఏర్పడ్డాయిగాని, ఆ భాష మాట్లాడే వారందరూ అక్కడికి రావాలని కాదు; రావద్దు. ఎక్కడున్న వారు అక్కడే వుండి, మీ భాషని, సంస్కృతిని కాపాడుకోండి. భాషా పరంగా మనందరిదీ ద్రవిడయన్ కుటుంబం. కమ్యూనికేషన్‌కి ఉపయోగబడేది భాష, భాషపట్ల అభిమానం వుండటం మంచిదేగాని అది దురభిమానంగా మారకూడదు .... మన ప్రధాని పివి గారికి తొమ్మిది భాషలు వచ్చు; ఈ జయలలితగారికి ఆరు భాషలు వచ్చు; తెలుగులో చక్కగా మాట్లాడ గలరామె .... తంజావూరు సరస్వతీ మహల్‌లోని 'ప్రాచీన లిఖిత గ్రంథాలు' అక్కడే వుంచమంటాను - పరిశోధకులకు పనికొచ్చేందుకు వాటి కాపీలు హైదరాబాదుకి అంద జేస్తే చాలు.... మీ విప్లవ నాయకురాలిని వీరనారి అని ఎందుకన్నానంటే, మూసుకు పోయిన దేవాలయాల తలుపులు తెరిపించిన ఘనత ఆమెది." — అన్నారు ఆంధ్ర ముఖ్య మంత్రి జనార్దన రెడ్డి.... "మా యింట్లో మాట్లాడేది తెలుగు. నా చిన్నప్పుడు త్యాగరాయ స్కూలులో చదువుకొనే రోజులలో, మూడు తెలుగు సెక్షనులు వుండేవి - ఇప్పుడు ఒక్కటున్నదేమో! అదీ వుందోలేదో! వ్యాపారానికీ ఉద్యోగాలకీ తమిళం నేర్చుకోవాలికదా. భాష కంటె ముఖ్యమైనది జీవనోపాధి. మేము తెలుగు వారమని చెప్పుకొనేందుకు యింట్లో విధిగా తెలుగు మాట్లాడుతాము; తెలుగు ఆచారాలు పాటిస్తాము తెలుగు పండగలు చేసుకుంటాము" అన్నారు సభకు అధ్యక్షత వహించిన తమిళనాడు ప్రభుత్వ చేనేత మంత్రి మధుసూదనన్, స్పష్టమైన తెలుగు నుడికారంతో .... ఫెడరేషన్ అధ్యక్షులు సియమ్‌కె రెడ్డి వినతి పత్రం సమర్పించారు. పరమహంస భువనేశ్వరి స్వామిజీ, కెయస్ ప్రకాశరావు, డాక్టర్ సత్యభామరెడ్డి, ఫన్ డాక్టర్ చంద్రశేఖర్ వీరిని ఫెడరేషన్ (చెన్నపురి తెలుగు ప్రజా సంస్థల సమిష్టి - 815 పూనమల్లి హైరోడ్, మద్రాసు - 10) సత్కరించింది. కంపీరర్స్; మురళీ మోహన్, జయచిత్ర: యస్పి ప్రార్థన గీతం ఆడిటోరియమ్‌లోకి గంభీరతను తెచ్చింది — ప్రారంభంలో ప్రదర్శించిన సినీ సాంస్కృతిక కార్యక్రమం, యిటువంటి సందర్భానికి అనుకూలమైనది కాదు.... ప్రజాహిత రంగంలో ఒకరు పదేళ్లుగా, మరొకరు ఇరవై ఏళ్లుగా కృషి చేస్తున్న యిద్దరు యిరుగు పొరుగు రాష్ట్రాల ముఖ్య మంత్రులని ఒక వేదిక మీద సమావేశపరిచి గౌరవించడం, ఫెడరేషన్ ఘనవిజయంగా, సియమ్‌కె రెడ్డి కృషి ఫలితంగా చెప్పుకోవచ్చు. (ఇంగ్లీషు ఉపన్యాసం అయాక స్వచ్ఛమైన తెలుగులో మాట్లాడారు జయలలిత)

. . . . . 06

"గృహ ప్రవేశం నాటికి ఇల్లంతా పూర్తి కాదు - కొద్దిపాటి పనులు మిగిలి ఉంటాయి. అలాగే, లాంఛన ప్రాయంగా పొట్టి శ్రీరాములు 90వ జయంతి సావనీర్ లోగడ రిలీజ్ చేశాము. కాని, కంప్లీట్ అయినది యివ్వాళ మీ ముందు వుంచుతున్నాము. దీని ప్రింటింగ్‌కి ఎనభై వేలకు పైగా ఖర్చయింది; ఒక్కొక్క కాపీ 'ప్రొడక్షన్ కాస్ట్' నూటపదిహేను రూపాయిలు గనక సావనీర్ వెల రెండో వందలుగా నిర్ణయించాము. అమరజీవి పొట్టి శ్రీరాములు ఆత్మాహుతి కాలం నాటి చరిత్ర యిందులో వివరంగా చెప్పాము" - అన్నారు కార్యదర్శి వైయస్ శాస్త్రి. సమావేశానికి బియస్సార్ కృష్ణ అధ్యక్షత వహించగా, ఆకాశవాణి 'ఎ యస్ డి' గోపాలకృష్ణ, సావనీర్‌ని పరిచయం చేస్తూ, సమీక్షించారు. దీనికి కావల్సిన వ్యాసాలు సేకరించడంలో, మల్లిక్ గావించిన కృషి, ఆ 'మిషనరీ జీల్' ప్రశంసనీయం. పొట్టి శ్రీరాములు పవిత్ర స్మృతికి ఈ సావనీర్‌ని అంకితం చేశారు.

. . . . . 10

తెలుగు సాహిత్యంలోని వివిధ ప్రక్రియలపై విహంగ వీక్షణ గావించి, వచన కవిత గురించి మాట్లాడుతూ, "నేను రెండుపూట్లా - ఉదయం, సాయంత్రం - ప్రార్థన కోసమని ఒక గంట సేపు కేటాయిస్తాను. భక్తి శ్రద్ధలతో భగవంతునిపై మనసు నిలిపి ప్రార్థిస్తాను. వేసవి కాలంలో ఎయిర్‌కండిషన్ కారులో వెళ్తున్నాను, ఆ 115 డిగ్రీల ఎండ వేడిమిలో, చెరువు గట్టున బండరా[illegible] కేసి బట్టలు బాదుతున్న [illegible]పతులను చూసేసరికి, నా మనసు కలవరపడి, దేవుడు నా ప్రార్థనలో వున్నాడా వారి శ్రమలో వున్నాడా అనే సందేహ మొచ్చింది"- అన్నారు, ఆంధ్రా యూనివర్సిటీ మాజీ వైస్ ఛాన్సలర్ యమ్మార్ అప్పారావు, సాహిత్య అకాడమీ ప్రాంతీయ కార్యాలయం వారు, పొట్టి శ్రీరాములు హాలులో ఏర్పాటుచేసిన లిటరరీ ఫోరమ్‌లో ప్రసంగిస్తూ!

. . . . . 15

"ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఆశ పెట్టిన రాయితీల కారణంగా, సంవత్సరం బట్టీ మద్రాసులోని తెలుగు సినిమా వారు చెట్టుకొకరు, పుట్టకొకరులా అయిపోయారు. అందరం యిలా సరదాగా కలుసుకోవడం అరుదైపోతున్నది.... 'స్వర్గం నరకం'లో నటించిన, నా బిడ్డలాంటి మోహన్‌బాబు, విలన్ పాత్రలు గాక హీరో అవాలని పట్టుబట్టి ప్రతిన బూని స్వంతంగా 'ప్రతిజ్ఞ' తీసి, శతదినోత్సవం జయప్రదంగా జరిపించాడు. నిరంతర కృషితో, తనని తను 'ఇంప్రువ్' చేసుకుంటూ, నవరసాలూ వొప్పించగల నటనా కౌశలుడు. రాఘవేంద్రరావు

దర్శకత్వంలో వచ్చిన 'అల్లుడుగారు' తో మోహన్‌బాబు దశ తిరిగింది. వరసని అయిదు హిట్స్. మోహన్ బాబుకి నేను చెప్పే సలహా ఒక్కటే – యిది హిట్ అవుతుందని తను జోస్యం పలకకూడదు. కష్టపడి పని చేయడం మనవంతు - ఆదరించడం ప్రేక్షకుల వంతు, అన్నట్లుగా ఉండాలి. ఎంత ఆత్మవిశ్వాసం ఉన్నప్పటికీ, దానిని మాటలలో వ్యక్తం కానీయకూడదు ... పోతే, రాఘవేంద్రరావుకీ, నాకూ ఒక సామ్యం ఉంది. దర్శకత్వం వహించి, మేము యితరులకి తీసిపెట్టిన చిత్రాలు కనక రాసులు కురిపించాయి ; స్వంత బేనరు మీద మేము తీసిన చిత్రాలు ఆర్థికంగా అంతంత మాత్రమే అయాయి. ఇన్నాళ్లకు రాఘవేంద్ర రావు స్వంత బేనరు చిత్రం - ఆర్‌కె ఫిలిమ్ అసోసియేట్స్‌ది - అపూర్వ విజయం సాధించింది ; కృష్ణమోహన్ కృషి యింత కాలానికి ఫలించింది. కలర్ ఫిలిమ్ వాప్తి కొచ్చాక, ఫీలులో ప్రవేశించిన రాఘవేంద్రరావుకి, వెండి తెరపై చెప్పే కథని గ్లామరైజ్ చేయ గల నేర్పూ, నైపుణ్యం ఉన్నాయి. ఇండియన్ పెనొరమాలో అటువంటి ప్రతిభాశాలి రాజ్‌కపూర్ ఒక్కడే! తెలుగు తెరకు మన రాఘవేంద్రరావు ఒక్కడే! ఈ 'అల్లరిమొగుడు'లోని కథ అతి సామాన్యమైనది ; అలాటి విప్పటికి అనేకం చూసి వుంటాం. కాని ఆ కథని రాఘవేంద్రరావు స్క్రీన్ ప్లేగా చేసి, చెప్పిన తీరు మాత్రం అనుపమానం ; అపూర్వమూను ; సన్ని

వేశ క్రమంలోని వేగమూ పరుగూ, ముందేమి జరుగుతున్నదనే ఉత్సుకత తో మనని నిలవ నీయవు - అదే రాఘవేంద్రరావులోని ప్రత్యేకత.... ఈ వేడుకల శుభసమయంలో యూనిట్ లోని అందరికీ నా శుభాకాంక్షలు" - అన్నారు, ఆర్ కె ఫిలిమ్ అసోసియేట్స్, విజయా శేష్ మహల్‌లో, 'అల్లరి మొగుడు' శతదినోత్సవ సభకు అధ్య క్షత వహించిన దాసరి నారాయణ రావు. హిందీ ఫీల్డ్‌లో, బొంబయిలో, యింత ఉత్సాహవంతంగా స్నేహ పూరిత వాతావరణంలో యిటువంటి నూరు రోజుల పండగ జరిపే నిర్మా తలు లేరు - అన్నారు అమరేష్‌పూరి. యాక్షన్‌లో ఎంత కరుకు తనంతో చూడగలడో, మనిషి మనసు అంత మెత్తన; వెన్నపూసలాటి మనసు సోదరుడు మోహన్‌బాబుది - అంటూ తన పలుకులలో ఆప్యాయత కన బరుస్తూ, మధ్య నొకసారి మోహన్ బాబు డైలాగ్ ఫక్కీ యిమిటేట్ చేసి, సభికులని నవ్వించారు చిరంజీవి. అమ్రేష్‌పూరి, కెయస్ ప్రకాశరావు, చిరంజీవి, దాసరి నారాయణరావు, మోహన్‌బాబు, మీనా, రమ్యకృష్ణ వేదిక మీద ఆశీనులయారు. హాస్యో క్తులు, ఛెళుకులు, చమత్కారాలు పెద జల్లుతూ కార్యక్రమాన్ని కంపీర్ చేశారు ఎస్‌పి బాలసుబ్రహ్మణం. ఘన విజయం సాధించిన కృష్ణ మోహన రావు, హీరోలని స్టార్లు చేయగల రాఘవేంద్రరావు అభినందనీయులు.

.... పిఆర్ఒ : ప్రమోద్ కుమార్ బిఎ రాజు.

..... 19

'న్యూ అమెరికన్ ఫిలిమ్ మేకర్స్' సీరీస్‌లో, పెన్నీ మార్షల్ దర్శకత్వం వహించిన 'బిగ్' (Big) అనే పిక్చరు నిన్నటి రోజున ఆహూతులకు చూపిం చారు అమెరికన్ సెంటర్లో... పన్నెం డేళ్ల బాస్కిన్, కోరికలు తీర్చే స్లాట్ మిషన్‌లో కాయిన్ వేసి, తనకు పెద్ద వాడినవాలని వుంది అని 'యాంత్రిక దేవతకు' చెప్పుకుంటాడు. 'నీ కోరిక నెరవేరుతుంది' అనే కార్డు జారీ చేస్తుంది ఆ మిషన్. తన వయసు మిత్రుడు బిల్లీతో, హాయిగా కబుర్లాడి, నిద్రపోయిన బాస్కిన్, తెల్లారేసరికి ముప్ఫయ్యేయిదేళ్ల మనిషి అవుతాడు. ఇంట్లోవాళ్లూ చుట్టుపక్కల వారు ఎవరో పరాయి మనిషి అనుకుంటారు. తాము జంటగా పాడే పాటని బట్టి గుర్తించిన ఒక్క బిల్లీ తప్ప, మిగతా మరెవరూ బాస్కిన్ మాట నమ్మరు. న్యూయార్కు వెళ్లి ఓక ఆట బొమ్మల షాపులో అసిస్టెంట్‌గా చేరుతాడు బాస్కిన్. చూపులకైతే ముప్ఫయ్యయి దేళ్లు గాని చేష్టలన్నీ పన్నెండేళ్ల బాలునివవటం వల్ల, బొమ్మలషాపు యజమానికి యితనంటే యిష్ట మేర్పడుతుంది. అదే కంపెనీలో పని చేస్తున్న ఒక యువతి, ఇతని చిలిపి చేష్టలకు ఆకర్షితురాలై ప్రేమిస్తుంది. దేహ నిర్మాణం ముప్ఫయ్యయిదేళ్లది గాని అందులోని మనిషి పన్నెండేళ్ల

వాడవడం చేత, ఈమె అడ్వాన్సెస్‌కి అతని రెస్పాన్స్ ఉండదు. అయినప్ప టికీ ఆమె బాస్కిన్ పట్ల మమతానురా గాలు పెంచుకుంటుంది. చివరికతను వెనకటి యాంత్రిక దేవత వద్దకు వెళ్లి, తనను మళ్లీ, పన్నెండేళ్ల బాలుని చేయమని వేడుకుంటాడు. ఆ దేవత కనికరిస్తుంది. తను ప్రేమించిన యువ కుడు, బాలునిగా మారి స్వగృహం చేరుకోవడం, విస్మయానందంతో వీక్షిస్తుంది ఆ యువతి.... తొందరగా పెద్దవాళ్లమయిపోవాలనే కోరిక పిల్లల లో సహజంగా ఉంటుంది. కాని, ఆ కోరిక అక్షరాలా నిజమైతే, తట్టుకో గలరా ? ఉహు, తట్టుకోలేరు. వయో ధర్మం ప్రకృతి విధించిన శాసనం.

ఇవ్వాళ చూపించినది 'రైజింగ్ అరిజోనా' (Rising Arizona) నిన్న టిది 1988 చిత్రమైతే యిది 1987 ది. దర్శకులు: జోయెల్ అండ్ ఎథాన్ కొయిన్.... అవక తవక దొంగతనాలతో, కారాగారవాసం అతవారిలు అయిన 'హయ్', ఎడ్వినా అనే పోలీసు ఉద్యోగినిని ప్రేమిస్తాడు. ఇద్దరూ పెళ్లి చేసుకుంటారు - అతను సత్ప్రవర్తకుడు అవుతాడు. అయితే, ఆ దంపతులకు తమకు పిల్లలు లేరనే దిగులు. 'హయ్' క్రిమినల్స్ లిస్టులోని వాడు గనక, చట్టరీత్యా దత్తత చేసుకో గల హక్కు లేదు; వైద్యరీత్యా ఎడ్వినాకు పిలలు కలిగే అవకాశం లేదు. అరిజోనాలో ఒక అవిడ అయిదుగురు పిల్లల్ని ఏక కాలమందు ప్రసవించిందనే వార్త, ఆ పిల్లలూ ఆ కుటుంబమూతో ఒకరోజున 'టివి'లో చూపిస్తారు.... అయిదుగురిలో ఒక రంటే ఒకరిని అపహరించి, తమ స్వంతం చేసుకుంటే ఎలా వుంటుందనే తలంపు 'హయ్'కి కలుగుతుంది; మాతృత్వ వాంఛానురక్తి గల ఎడ్వినా సహకరిస్తుంది... హయ్, ఆ అయిదు గురిలో నథాన్ అనే బేబీని అపహరించ డం, వీరి వద్దనుంచి ఆ బేబీని బాంకు తస్కరులు ఎత్తుకుపోవడం, ఆచూకీ తెలిపినవారికి ఇరవైవేల డాలర్లు బహుమతిగా తలిదండ్రులు ప్రకటించ డం, మోటర్ బైక్ గాంగ్‌స్టర్ ఈ బేబీని చేజిక్కించుకోవడం, చివరికి హయ్, ఎడ్వినా దంపతులు ఆ పసి వానిని తలిదండ్రులకి వొప్పగించడ మూతో కరుణాశ్రువులతో ముగుస్తుంది కదనం.... ఈ రెండు చిత్రాలలోను సినీ టెక్నిక్ సోయగాలు మనని అలరించి ఆనందింపజేస్తాయే గాని, యితివృత్తాలలో బలం లేదు - అతకని సన్నివేశాలు అక్కడక్కడ కనిపిస్తాయి.

..... 20

"ఈ మాల్గాడి శుభ కంఠంలో వొంపుసొంపుల మాధుర్యం వుంది; లిరిక్స్ రాసిన సాహితి ఒక ప్రత్యేక బాణీగల వ్యక్తి; అలాగే మ్యూజిక్ సమకూర్చిన 'నవీన్ - జ్యోతి' ఒక వరవడి రూపొందించుకుంటున్న యువకులు" అన్నారు దాసరి నారాయణరావు, సుప్రీమ్ ఎంటర్ ప్రయిజెస్ వారి (మురళీధర్ - హైదరా బాదు) 'కొక్కరకొ' ఆడియో

కాసెట్ (వెల : రు 28-00) నవీన్ ఇంటర్నేషనల్ హొటల్‌లో రిలీజ్ చేస్తూ.... నల్గొండ వదినమ్మ, మావ నన్ను దలుచుకో, గండిపేట తీసుకొ పోర, తాండూరు తాటికల్లు, భాంచన దొర, నవుటుపల్ కాడ, రామప్ప సెరువు, సింగరేని కాలరీ - ఈ ఎనిమిది పాటలలోను తెలంగాణా జానపద సాహిత్యపు సొగసులు, మెలికలు, సుతిమెత్తని మాటలు, ఆ మాటలలో జానపదులు స్ఫురింప జేసే రసోచితి ఉన్నాయి. గానవాహినిలో తేలిపోయే కొన్ని మాటలు, మనకు పరిచితం గానివి అయినప్పటికీ ఆనందించ గలుగుతాము.... పి ఆర్ఒ : జగదీష్ బాబు.

. . . . . 21

మమ్ముట్టి, విష్ణువర్ధన్, తిలకన్, రఘు, అంజు, వత్సల, భామ మున్నగు వారున్న 'చాందినీ ఫిలిమ్స్' మాతృక నుంచి రాజశ్రీ మాటలూ పాటలూతో తెలుగులోకి వస్తున్న 'కంకణం' చిత్రానికి ప్రొడ్యూసర్ : ఎడిటర్ మోహన్. జులై నెలలో ఇది ఆంధ్రాలో విడుదల కానున్నది కొన్ని సన్నివేశాలూ సాంగ్సూ ఈ ఉదయం పాత్రికేయులకు ఎమ్ ఎమ్ థియేటర్‌లో చూపించారు.... అలియర్ ముఠాలోని అంటోని, హంస, రామయ్యలలో, ఆంటొని చెడు మార్గం వొదిలి సుజాతతో స్థిరపడి, ఏడాది పాపతో స్థిరపడ్డప్పటికీ, వెనకటి పంకిలం వొదలక, అరెస్ట్ అవుతాడు. పోలీసు సూపరెంట్ హరిదాస్ అతనిని బావమోదుతాడు. ఆ హింసకంటె అతిదారుణమైనది, ఒక ఇనస్పెక్టరు, ఆంటోని భార్య సుజాతని రేప్ చేయడం. పగతీర్చుకునేందుకు మళ్లీ ఆలియర్ ముఠాలో చేరుతాడు ఆంటోని, దొమ్మీలో సుజాత మరణిస్తుంది. ఆంటోని పధ్నాలుగేళ్ల జైలు పాలవుతాడు. విడుదలై వచ్చాక, మళ్లీ హరిదాస్‌కీ, ఆంటోనికి మధ్య సంకుల సమరం, ఈ సారి హరిదాసు చనిపోతూ, తనవద్ద పెరుగుతున్న ముగ్గురు పిల్లలలో ఒకరు ఆంటోనీ సంతానమని జెబుతాడు - ముగ్గురిలో ఎవరో చెప్పకుండా కన్నుమూస్తాడు. ఇక, ఆంటోని ధ్యేయం హరిదాసు పిల్లలని ప్రాణాలొడ్డి కాపాడటం ; ఆ కారణంగా ఆలియర్, యితనూ చెరో పక్షం అవుతారు.... పోలీసు శాఖని, సంఘ విద్రోహశక్తిని, వంతుల వారీ హీరో విలన్‌లుగా చేయడం తప్పితే, యిటువంటి గాంగ్‌స్టరిజమ్ మన దేశంలో లేదు. ఏ ప్రజాస్వామిక దేశంలోను వుండగల అవకాశం లేదు. అయితే, అచ్చులోను, తెర మీద బీభత్స భయానక రసాలకు అచ్చెరువొందేవారు ఎప్పుడూ వుంటారు.... పిఆర్ఒ : అర్జునరావు.

'అన్నమొద్దు, సున్నమొద్దు - ఉన్న ముద్దు, చాల్లేదూ.... గబ్బర్‌సింగ్ నవ్వు ఆపు' అంటూ ఒక నవ మోహనాంగి కవ్వింపుతో, సాగే శ్రీ రామ లక్ష్మి మూవీస్ వారి 'శౌర్య చక్ర' (సమర్పణ : జక్కంపూడి సత్యనారా

యణ మూర్తి ; నిర్మాత: దేవు శివా నందరావు) చిత్రంలోని పాటలు కొన్ని యమ్‌యమ్ థియేటర్‌లో పాత్రి కేయులకు చూపించారు. పిక్చర్లోని ఆరు పాటలూ సిరివెన్నెల సీతారామ శాస్త్రివి. పాడినవారు: యస్పి బాలసుబ్ర హ్మణం, చిత్ర. మ్యూజిక్ : రాఘవులు. అబ్బాయో ఏందా సూపు, సెభాస్ అనండే, మొదట చెప్పిన అన్నమొద్దు, ఒడిదుడుకులు ఏడినావా, సహనం చాలించవమ్మా, అప్పుడే ఏమైందిరా అప్పులకొండా.... సినిమా పాట రక్తి కట్టేందుకు యాక్షనూ, లొకేషనూ, వాద్యమే గాక, మాటలు సుస్పష్టంగా వినిపించాలి. ప్రబోధ గీతం లాటి వాటిలో ఆ స్పష్టత ఉన్నది గాని కొన్నిటిలో లోపించింది.... ఆరణి వ్రాసిన కథకు గణేశ్ పాత్రో మాటలు. శోభన, రాజ్‌కుమార్, కోట శ్రీనివాస రావు, బాబు మోహన్, వేలు, వై విజయ, రజిత, లక్ష్మీప్రియ మున్నగు వారున్నారు .... శౌర్య చిత్రా పాటల కాసెట్‌ని బాలాజీ ఆడియో అండ్ విడియో కంపెనీ వారు విడుదల చేశారు. (5 మూడవ అంతస్తు, మిథిలా కాంప్లెక్స్, 4-4-296/297 బాంక్ స్ట్రీట్, కోఠి, హైదరాబాదు-500 195.... వెల. రు 28-00).... పిఆర్ఒ: బిఎ రాజు:

. . . . . 23

మద్రాసు మైలాపూరు రోటరీ క్లబ్ వారు (3230), తమిళనాడు కార్మిక శాఖా మంత్రి రఘుపతి ముఖ్య అతిథిగా, 'ఎమ్‌ప్లాయర్ – ఎమ్‌ప్లాయీ రిలేషన్స్ అవార్డు' (పని యిచ్చే వారికీ, పనిచేసేవారికీ, అంటే స్థూలం గా, యాజమాన్యానికీ, సిబ్బందికీ మధ్య సత్సంబంధ బహుమతి) సాన్మాక్ మోటారు ఫైనాన్స్ వారికి (M/s Sanmac Motor Finance Ltd), 'హొటల్ పార్క్ షెరటాన్' లో అందజేశారు.... "తమ వృత్తి వ్యాపకాలలో కృషి చేస్తూ, సమాజానికి తమ సేవా నిరతి ద్వారా సాయపడ టం రోటరీ లక్ష్యం. ప్రతి రొటేరి యనూ తన పరిధిలో ఉన్నత విలు వలు పెంచి, ఆదర్శ ప్రాయమగు మానవతా బంధాలు నెలకొల్పేందుకు పాటుపడతాడు," - అన్నారు మైలా పూరు రోటరీ ప్రెసిడెంట్ శంకర సుబ్రమణియమ్. ఈ సత్సంబంధ బహుమతి ప్రదానం అయిదేళ్లుగా, చేస్తున్నారట. కార్మిక శాఖ సెక్రటరీ వరదరాజులు, సీనియర్ అడ్వకేటు యన్వి రాఘవాచారి మున్నగు వారు ప్రసంగించిన మీదట, 'సాన్మాక్' మేనేజింగ్ డైరక్టరు అరుణాచలం చెప్పారు: "ముగ్గురితో, 1987లో ప్రారంభించిన మా కంపెనీలో యిప్పుడు అరవైమంది పనిచేస్తున్నారు. 75 లక్షలతో మొదటి సంవత్సరమైతే, ఇప్పుడు 12 కోట్లు. ఏ సంవత్సరాని కా సంవత్సరం రెట్టింపు చొప్పున పెరుగుతోంది. 200 కంపెనీలలో మాది ఒకటి. మా విశిష్టతను గుర్తిం చిన మైలాపూర్ రోటరీ వారికి మా కృతజ్ఞతాభివందనములు.... ఉత్పత్తి

దారు కారులు తయారు చేస్తాడు; వాటిని అమ్మకందారు మార్కెట్లో పెడతాడు; కాని, కొనుగోలుదారు వద్ద అంత డబ్బు ఒక్కసారి పోసి కొనే స్తోమతు వుండదు. అమ్మేవారికీ, కొనేవారికీ మధ్యగా మేమొస్తాము. కొనుగోలుదారు తరఫున మేము నిల బడి, అమ్మకం దారునికి పూర్తిగా డబ్బు యిచ్చేసి, మేము కొలుగోలు దారుకి అప్పు పెట్టినది నాలుగు మూడేళ్లలో వడీతో వసూలు చేసు కుంటాం. ఈ డబ్బంతా మేము మా యింట్లో నుంచి తీసుకొచ్చి యివ్వటం లేదు. ప్రజలు దాచుకున్న డిపాజిట్ల నుంచి, బాంకులు యిచ్చే ఋణ సౌక ర్యం నుంచి ఈ వ్యాపారం జరుగు తుంది. మేము ఉత్పత్తి చేసే సరుకు ఏమీ వుండదు - కాని, తభావతు లేని సర్వీస్ మా ఊపిరి. 4000 చ॥అ॥ వైశాల్యం గల మా ఎయిర్ కండీషన్ ఆఫీసులో పనిచేసే వారందరూ తామొక విస్తృత కుటుంబ సభ్యుల మనుకుంటారే గాని, ఎవరి దగ్గిరో ఊడిగం చేస్తున్నామని అనుకోరు - కంపెనీ అభివృద్ధిలో తమకూ సముచిత పాత్ర వున్నదని తలపోస్తారు. ఆ సత్సంబంధాలే మా విజయానికి జీవ గర్ర''.... కార్మిక మంత్రి రఘుపతి, టుటికోరిన్ రోజులలో తనకు రోటరీ తో గల అనుబంధం గురించి చెబుతూ, ప్రపంచ వ్యాప్తంగా రొటేరియనులది గణనీయమగు సేవాధర్మం - అన్నారు; 'సొన్మాక్'ని అభినందించారు .... సెక్రటరీ సురేంద్ర కుమార్ నెలపెె ప్రోగ్రాముల గురించి చెప్పిన మీదట కనక మూర్తి వందన సమర్పణ; ఆ తర్వాత డిన్నర్.

—యవ్నార్ చందూర్

## నెహ్రూ వాణి

నాలుగు రోడ్ల కూడలిలో నిలబడి 'శాంతి కావాలి' అని గొంతు చించుకు అరిచినంత మాత్రాన, మన అభి ప్రాయాలకు వ్యతిరేకంగా వున్నవారి బుర్రలు బద్దలుకొట్టినంత మాత్రాన 'శాంతి' అవతరించదు.

మన చుట్టూ ఎంతో దుష్టత్వం వుంది; ఎంతో పతనం కనిపిస్తోంది; అయినప్పటికీ ఈ లోకంలో మనం జీవించక తప్పదు. అంచేత, సౌజ న్యాన్ని వెతికేందుకు మనం ప్రయ త్నం చేయాలి. అన్వేషించిన కొద్దీ ఈ లోకంలోని మంచితనం మనకి కనిపిస్తుంది.

చక్కటి భవంతులు, చక్కటి చిత్రాలు, చక్కటి పుస్తకాలు, చక్క దనం గల సమస్తం నాగరికతకు చిహ్నాలు. అయితే ఈ చక్క దనాల న్నిటినీ మించిన చక్కదనం, సిసలైన సౌందర్యం, యితరుల మేలుకోసం పాటుపడే స్వార్థరహితులలో వుంది.

—పండిట్ నెహ్రూ

*Travelogue*

# Another Week in West Bengal

We left Madras on Wednesday and today is Friday. After a nap and tea, the ladies, Radha, Sundari and Malati, said they would embark on window-shopping and regular shopping, while Sivaswamy and I opted for the Shakespeare Road where Bharatiya Bhasha Parishad is located. Director Balshowri Reddy knew we had come but still I thought my first visit should be to his place. The Parishad is a five-storey building with second and third floors occupied by them. The second floor is with spacious rooms for the Director, the Secretary, the President and other official staff. As you come out of the lift, on the right is their office and on the left a nice modern auditorium with well-cushioned seating and moving space. On the third floor, to the left the residential accommodation is provided for the Director and to the right, well-furnished guest rooms intended solely for writers of repute at moderate rates. The entire appearance of the building and the manner in which it is maintained, gives you an idea as to the impressive stature of this great organisation. When we see such places solely devoted to culture and literature without any political strings, we feel all is not lost and still there is hope for bright things. I would have said the same even if Malati were not a recipient. Such is the great and noble work this illustrious organisation has been doing so silently. It is a matter of pride for Telugu-speaking people that Balshowri Reddy, a well-known link between Hindi and Telugu, has been at the helm of affairs as Director of this Parishad.

Sivaswamy knew the premises earlier but to me it was something much beyond my expectation. "From the invitation card I gave you in the afternoon, you could have understood how artistic and tasteful they are - no loudness or cheapness. We have to learn a lot from

these people - especially the behavioural pattern. They mingle tradition with modernity and make it very pleasing. The charm of this city is something different from what we know of at Madras," said Sivaswamy.

Of course I fell in love with this great city much before I stepped on on its soil. New Theatres and Sarat were the first strong bonds followed by *Gardener* and *Stray Birds* of Tagore. That was not a time to muse over such matters. We learnt that Balshowri Reddy was in the auditorium and went in. Sivaswamy walked straight to the dais while I followed him. A good-looking, simple but attractive lady, was at the mike practising the programme meant for the next day, with Balshowri Reddy giving her tips. Sivaswamy greeted her with a smile and spoke some pleasantries. I was introduced to her by Balshowri Reddy Kusum Khemani looked at me and my Madrasi dress with an observant smiling eye and said in soft words "Now I know who created Malati Chendur." It was an exquisite compliment from a lady who didn't know Telugu and who had never read either her writings or mine. Of course, we have a common friend in Sivasankari who received this Bharatiya Bhasha Parishad award last year for her Tamil work Verillanda Marangal. During the next two days we had occasion to meet several times and to Kusumji. Madras means Sivasankari and the Chendurs and she assured us she would be visiting this southern metro in October '92.

Next evening the function was to commence exactly at six and for the ten recipients the time allotted for citation and award-presentation was just three minutes each The whole meeting should be over in about seventyfive minutes and a music concert of about twenty minutes was to follow. Secretary Kusumji would read tho citations while the President and Director Balshowri Reddy would offer the awards to the respective recipients. As they were deeply involved in timing the next day's programme, we spent ten minutes and took leave of them.

As there was no speech-making at the Awards

Function, Malati was looking quite relaxed on Saturday. We were asked to be there by five-thirty so as enable literary friends of different regions to get acquainted. Radha and her family friends came in two vehicles, while Sivaswamy took both of us in his vehicle.

As we stepped out of the lift on the second floor, it was so colourful with flower decoration that the entire atmosphere where a festive look Mild - scented breeze was pervading. Big-Size photographs of the ten recipients along with their important titles in respective languages were displayed on a high-raised table with utmost artistic decorum. It was a wonderful gathering of ten literary luminaries along with their near ones. The respect and the reverence this organisation has for literature and literary pursuits is phenomenal. And it was a surprise to learn that the Sanskrit volume displayed there costing Rs. 540/- was printed in Viet Nam. The recipients to be honoured were : Rabati Mohan Chowdhary (Assamese - Bujaloni Puraskar), Malati Chendur (Telugu – Sureka Puraskar) Ram Swarup Anki) (Punjabi - Kayan Trust) Ashish Sanyal (Bengali - Ramkumar Bhuwalka), Viswas Patil (Marathi - Ramkumar Bhuwalka) ONV Kurup (Malayalam - Bhilwara), Ganga Prasad Vimal (Hindi- Nathmal Bhuwalka), Vijayadar Dotha [Rajasthani-Rameshwar Tantia], Satyavrat Shastri (Sanskrit - Kayan) and Krishna Khatwani [Sindhi - Khemani]. The different Puraskars are by individuals and different institutions but they have to be administered thro' Bharatiya Bhasha Parishad at their discretion.

The meeting commenced correct to the minute and after the formal welcome speech and the President's remarks, the award function took just thirty minutes. "I would like to speak in English for the benefit of our friends from non-Hindi speaking areas. Literature is the only link that is bringing in different regions closer. Unfortunately the entire atmosphere in the country is getting polluted with politics. Let us hope and pray that the academic world and literary field keep themselves above all pettiness. In whichever part of the country we live and whatever language we

peak India is one, ours, heritage and culture are one. I congratulate all the recipients for their literary contribution in their l a n g u a g e s," said Dr. Pabitra S a r k a r, Vice-Chancellor of Rabindra Bharati University who presided over the function.

At the auditorium we had occasion to meet several friends, prominent among them being Prameela Subbarao Couple of the Andhra Association, Prabhakara Rao of the National Library, Ramanujacharyulu of Indian Overseas Bank etc. Soon after the function, we had to go to the Hindusthan Club where a dinner was arranged for the recipients. At dinner, I met Vishwas Patil whose Marathi novels with historical background are very popular. A senior officer in the government, he could find time for his literary pursuits. His novel 'Panipat' has gone into seven editions in just two years - a worthy record in language-publishing.

The Sivaswamys could not accompany us, as they had another important dinner engagement. Driver Khan was with us and by the time we returned home, it was nine-twenty or so. Till twelve we went on talking - don't ask me on what subject - all subjects under the sun.

Seminar that followed the Award Function was on Sunday - from nine till five. Most of them spoke in Hindi, while the moderator (Ms. Prabhavati) chose both English and Hindi. Kurup from Kerala and Malati from Madras spoke in English. Some read lengthy papers. Of the ten recipients, five participated in the morning session, while the other five in the afternoon session. The seminar must have been quite interesting but I could not follow due to my lack of knowledge in Hindi. That was the one time when I felt I should learn Hindi. At three-thirty while we were about to move out, Kusumji told me, "Malati might hesitate but you please collect your trainfares. We shall meet at dinner tonight."

That evening Radha and Sivaswamy along with some friends took us to the Andhra Association. Quite a number of ladies were eager to see their dream-figure in flesh and blood. It was a pleasant gathering and both Malati

and Sivaswamy spoke in lighter vein throwing the audience into peals of laughter. The Association presented a sum of Rs. 1116/- to Malati Chendur as a token of their admiration and appreciation for her. "Anything got without adequate payment is not properly evaluated" is the opinion of Sivaswamy and I completely concur with him.

Just like last night this night also, they had dinner elsewhere. Driver Khan who had been with us since our arrival on Friday morning, took us to Bharatiya Bhasha Parishad office and with Balshowri Reddy and Subbadra joining us, we went to the secretary's house for dinner As the dinner was getting ready, Malati threw the ball; "While Freedom Fighters - 44 thousand or so - are getting A/C Sleeper Railway Pass with provision for an attendant to accompany the freedom fighter in the same class, why not atleast a couple of hundred poor Indian writers be shown that advantage - not for life as in their case, but for one or two years to enable them to see the country and carry the message of oneness in their language. National Integration can be served better that way. The scheme can be worked out thro' prestigious literary organisations which have absolutely not political links." (May be she had in her mind the trip she undertook in later seventies, along with Kavita Sinha and fifteen others, at the instance of the Field Publicity Department of Government of India).

The discussion went on and on and finally the secretary said that we should make a beginning somewhere.

*(to be continued)*

**—NR. CHENDUR**

---

The first reference to the name Calcutta was made in the "AIN—N—AKBARI"

In 1688. There are older references too, one supposedly dating back to the end of the sixteenth century.

The oldest road in Calcutta is Chitpur which gets its name from a diety named Chitreswari Debi. The earliest reference to Chitpore is in a work dated 1495-96, though the relevant portion is believed to be an interpolation.

*Courtesy : 'West Bengal'*

సమీక్ష

### సూర్య చిత్ర వారి
### 'పెద్దరికం'

జానకి అనే 'లా' కాలేజీ స్టూడెంట్‌కి, ఒక మంత్రి వరునితో నిశ్చయమైన పెళ్ళి, ఆఖరి క్షణాన బెడిసికొడుతుంది కారణం: పర్వతనేని పరశురామయ్య పగ. ఎవరి మీద? బసవ పున్నమ్మ (భానుమతి) మీద. లోగడ ఒక పెళ్ళి పందిట్లో పరశురామయ్య భార్య, బసవ పున్నమ్మ భర్త కుటుంబ కక్షల మరణానికి లోయారు హత్యాభియోగనేరం మీద పరశురామయ్య జైలు శిక్ష అనుభవించి వచ్చాడుగాని పగ మాత్రం చల్లారలేదు. 'స్త్రీలకు ప్రవేశం లేదు' అనే బోర్డు తన గేటుకి కట్టించాడు. జమాజెట్టిల్లాంటి నలుగురు కొడుకులూ పితృవాక్య పరిపాలకులు. అలాగే, బసవ పునమ్మకీ నలుగురు కొడుకులు వున్నారు - వారు మాతృ విధేయులు. పెళ్ళి తప్పిపోయిన జానకి, బసవ పున్నమ్మకి కొడుకు కూతురు - అంటే నానమ్మ అవుతుంది. తిరిగి కాలేజీలో చేరిన జానకి, కృష్ణమోహన్ వల్ల (పరశురామయ్య చివరి కొడుకు) అవమానం పొంది, యిక తను కాలేజీకి వెళ్లనంటుంది. బసవ పున్నమ్మ, తన మనుమరాలిని ముద్దుగా దగ్గరకి తీసుకు 'అవమానించిన వానిపై పగదీర్చుకోవడం స్త్రీలక్షణం - పెళ్లి చెడగొట్టిన ఆ పరశురామయ్యకి బుద్ది చెప్పగల ఛాన్సు యిది. ఆ కృష్ణమోహన్ ప్రేమించినట్లు నటించి, కొంగున ముడివేసుకో - అని హితువు చెబుతుంది. కృష్ణమోహన్ ఫ్రెండు (సుధాకర్), కృష్ణమోహన్‌కి, ఆ అమ్మాయిని ప్రేమించినట్లు నటించి, బసవ పున్నమ్మకి బుద్ధి చెప్పు - అని సలహా యిస్తాడు నానమ్మా ప్లానూ, మిత్రుని మాటా నమ్ముకున్న ఈ యువతీ యువకులు కొంతవరకూ జాగర్తగా వుండి, ఆ పైన బుడుంగున ప్రేమలో పడతారు. కృష్ణమోహన్ అన్నగారూ ఆంజనేయ స్వామి భక్తుడూ అయిన రామకృష్ణ (చంద్రమోహన్) తన పేరు గోపాలకృష్ణగా మార్చుకు, డాన్సుటీచరు లలితను చేరదీసి, యిద్దరు పిల్లల తండ్రి అవుతాడు. ఈ లలిత కారణంగా పరశురామయ్య కోట బీటలు వారుతుంది; జానకీ కృష్ణమోహన్‌ల పెళ్లి సినిమెటిక్‌గా జరుగుతుంది. మోటివేషన్‌లేని అవాస్తవికపాత్రల మధ్యనాటకీయత ...దర్శక నిర్మాత : ఎయమ్ రత్నం... ....పిఆర్ఒ : జగన్.

సైన్స్ ఫిక్షన్స్

# జూలియన్

## అన్నపూర్ణా రెడ్డి

గడిచిన కథ : డాక్టర్ మల్హోత్రా 'కాజిల్ లోలిటా'కు మిత్రులు రాజేష్, షార్మాలు వచ్చారు నూతన సంవత్సర వేడుక సందర్భంగా. మిత్రత్రయం ప్రతి న్యూయియర్‌కి విధిగా కలుసుకుంటారు. ఈ సంవత్సరం మల్హోత్రా మేనకోడలు సునీత కూడా ఉంది. ఆగంతుకునిలా వచ్చాడు జూలియస్. UFOల గురించి మాట్లాడుకుంటున్నారు.... (ఇక చదవండి

"భూమ్మీది సైంటిస్టు అనడంలో మీ ఉద్దేశ్యం మిస్టర్ జూలియస్!" రాజేష్ సూటిగా ప్రశ్నించాడు.

"ఐ మీన్.... ఇతర గెలక్సీల సైంటిస్టులూ వుండవచ్చుకదా !"

"సరే ! వాళ్ళెక్కడున్నారో ... వాళ్ళ అభిప్రాయా లేమిటో అసలు గెలాక్సీలలో గ్రహాలున్నాయో లేదో ?"

"అందుకే భూమ్మీది సైంటిస్టులు అంటున్నాను, మిస్టర్ రాజేష్ .. ప్లానెట్ ఎలాటిదైనా.... అక్కడి టెంపరేచర్ బాయిలింగ్, ఫ్రీజింగ్ పాయింట్స్ ఆఫ్ వాటర్.... వుండాలని శాస్త్రజ్ఞుల అంచనా! అప్పుడే అక్కడ ప్రాణి జీవించడానికి అనువైన అనుకూల వాతావరణం నెలకొంటుంది!" వివరించాడు జూలియస్.

"ఏమిటో అంతా అయోమయ స్థితిలోకి దింపేసేట్టున్నారు .... మీరంతా" అన్నాడు సోఫాలో వెనక్కు వాలుతూ రాజేష్....

"దట్స్ ఇంటరెస్టింగ్." మల్హోత్రా తల తాటించాడు.

"నా ఊహ కందని విషయాలివి !" వంతపాడాడు డాక్టర్ షార్మా.

బైట బజర్ మోగడంతో చర్చకు ఫుల్‌స్టాప్ పడింది. అప్పటికి గంట తొమ్మిది కావచ్చింది. దట్టంగా పేరుకు పోయిన పొగమంచు విడిపోయింది. సూర్యుడి కిరణాలు సైతం పొగ మంచుతో రాజీపడి నులివెచ్చగా మిగిలి పోయాయి.... అల్లరి గాలి మాత్రం అటూ ఇటూ పరుగులు తీస్తూ తన ప్రతాపాన్ని చూపిస్తూంది.

నూతన సంవత్సర శుభాకాంక్షలు తెలుపడానికి వచ్చిన వారిని సాదరంగా లోనికాహ్వానించి.... కరచాలనం కావించి, వారికి ఉచిత

రీతిని మర్యాదలు కావించడంలో మునిగిపోయాడు డాక్టర్ మల్హొత్రా.

'వి విల్ గోఫర్ ఎ స్టోల్.... ఇన్ ది గార్డెన్' అంటూ డాక్టర్ షార్మా, రాజేష్‌లు నిష్క్రమించారు.

మిస్టర్ జూలియస్ లైబ్రరీలో కాస్సేపు ప్రొద్దుపుచ్చాలన్న అభిలాష వెలిబుచ్చడంతో, జూలియస్‌ను లైబ్రరీలో దిగవిడిచి..... తిరిగి హాల్లోకి వచ్చి మేనమామకు అతిథులను రిసీవ్ చేసుకోవడంలో సాయం చేయసాగింది సునీత.

మధ్యాహ్నం ఒంటి గంట తరువాత అతిథుల రద్దీ ఇంచుమించు ఆగిపోయింది

విందు భోజనం కులాసా కబుర్లతో ముగించి, ఆ పైన స్నేహితులకు, మేనకోడలికి, నౌకర్లకూ నూతన వస్త్రాలు పంచిపెట్టాడు డాక్టర్ మల్హొత్రా.

మిస్టర్ జూలియస్‌కు కూడా ఒక మంచి కాశ్మీర్ శాలువ బహూకరించాడు.

నౌకర్లకు ఆ మధ్యాహ్నం నుండీ సెలవిచ్చి పంపేయడంతో .... అందరూ క్రొత్త బట్టలు కట్టుకొని మరిన్ని కృతజ్ఞతలు తెల్పుకొని వెళ్ళిపోయారు.

భుక్తాయాసం తీరేదాకా నిద్రపోయి లేచేసరికి పొగమంచు ఆ కొండ ప్రాంతాన్నంతా కమ్మేసింది.

## 4

చలి కూడా అధికంగా వుండడంతో.... ఏకంగా భోజనాలు ముగించుకొని అలా కొంత దూరం వాకింగ్ అంటూ బయలుదేర దీశాడు మల్హొత్రా.

శుక్ల పక్షపు రోజులు .. తెలి వెన్నెలలో మంచుతో తడిసిన కొండ కోనలు అదో విలక్షణమైన అందంతో వెలిగిపోతూంటాయి. ఆ అందాన్ని చూచే అవకాశాన్ని ఎట్టి పరిస్థితి లోనూ జారవిడచుకోరు మిత్ర బృందం....

నైనిటాల్ వెళ్ళే దారి కాకుండా, డీప్ ఇన్‌టు ద ఉడ్స్, వెళ్ళడానికి ప్రపోజ్ చేశాడు షార్మా....

మఫ్లర్లు, స్వట్టర్లు, కార్డిగన్స్ ఉలెన్ పేంట్లు కాళ్ళకు ప్రొటెక్షన్ కోసం గమ్ బూట్స్ వేసుకొని, మిత్రులు ముగ్గురూ ముస్తాబయ్యారు...

గతరాత్రి తొడుక్కున్న సూట్ వేసుకుని, షాల్ భుజాల మీద వేసుకొని తయారయాడు జూలియస్.

ఫుల్ హాండ్ షర్ట్, ఉలెన్ స్ట్రెచ్ పాంట్స్, స్లీవ్‌లెస్ బ్లూ స్వెట్టర్ వేసుకొని,.... తలకు స్కార్ఫ్, కాళ్ళకు గమ్ బూట్స్‌తో తయారైంది సునీత....

"బేబీ.... బయలుదేరుదామా" అంటూ రాబోయిన డాక్టర్ మల్హొత్రాను భుజం మీద చేయి వేసి ఆపుతూ....

"ఓయ్ బుద్ధూ.... మనం ముసలాళ్లం.... వాళ్లు పడుచువాళ్లు.... నీకో ఐడియా ఇవ్వనా...." అన్నాడు రాజేష్.

ఏమిటన్నట్టు క్యూరియస్‌గా చూశాడు మల్హోత్రా.

"ఇక్కడికి రెండు కిలోమీటర్ల దూరంలో రామ్‌పూర్ వెళ్లే రోడ్డు కూడలి వస్తుంది. ఆ కూడలి చేరుకోవడానికి రెండు మార్గాలు - ఒకటి మామూలు రోడ్డు, రెండవది అడవి ప్రక్కగుండా వెళ్ళేదారి.... మనం ఓపని చేద్దాం.... మనం ముగ్గురమూ రోడ్డు దారి వెంట వెళ్దాం.... ఎంగ్‌బ్లడ్ ఇద్దరూ రెండో మార్గం గుండా రాంపూర్ కూడలి చేరుకొంటారు. కాస్సేపక్కడే కూచొని.... అందరం కలసి వచ్చేద్దాం.... మన ముసలి వాసన నుండీ వాళ్ళకూ కాస్త రిలీఫ్ వాళ్ళిద్దరూ.... ఫ్రీగా కబుర్లు చెప్పుకోవడానికి అవకాశంగా వుంటుంది ఏమంటావ్?" అన్నాడు రాజేష్.

'నాట్టె బాడ్ ఐడియా.... నీబుర్ర కూడా అప్పుడప్పుడు పని చేస్తుంది రోయ్" - అంటూ భుజాలెగురేశాడు డాక్టరు మల్హోత్రా.

ఇంటికి తాళం పెట్టి జేబులో చెరో పెన్ టార్చి వేసుకొని తమ రెండు బాచ్‌లు ఎక్కడ కలుసుకోవాల్సిందీ చెప్పి ఎవరి దారిన వాళ్లు విడిపోయారు.

స్కూల్లో టీచర్లు, ఇంట్లో మేనమామ, నౌకర్లు చాకర్లతో తప్పా ఇతర వ్యక్తులు, అందునా మగవారితో పరిచయం లేని సునీత, మేనమామ చేసిన సూచన విని మొదట నిర్ఘాంత పోయినా, తనది స్థానబలిమి కావడంతో.... ముక్కు ముఖం తెలియక పోయినా మిస్టర్ జూలియస్ వెంట నడిచింది.

కుమవాన్ పర్వత సౌందర్యం చుట్టుపట్ల గల టూరిస్ట్ ప్లేసెస్ గురించి జూలియస్‌కు వివరిస్తూ ముందుకు సాగింది. పర్వత సానువుల నుండి వీచే స్వచ్ఛమైన గాలి.... మంచులో తడిసి, సుగంధ భరితమై మత్తు గొల్పుతూంది. ఏ ఆచ్ఛాదనా లేని కొంతమేర చర్మం మాత్రం శీతాకాలం చలిని అనుభవించ గలుగుతోంది. అయినా అవేమీ లెక్క చేయడం లేదు వాళ్ళిద్దరూ.... చెట్టా పట్టా వేసుకోక పోయినా.... కాస్త సన్నిహితంగానే, ఒకరి ప్రక్క నొకరు,... ఒక్కటిగా అడుగులేస్తూ,... రాళ్ళదారి వెంట ముందుకు సాగారు. సునీత చెప్పే కబుర్లు సరదాగా వింటున్నాడు జూలియస్.

మిత్రత్రయం....

చదువుకొనే రోజుల్లో ఎలా భుజాల మీద చేతులేసుకొని కలసి తిరిగే వారో, అలాగే ఒకరి భుజాన్నొకరు ఆసరా చేసుకొని, ఆ రోజుల్లో చేసిన అల్లరి పనులు, అకతాయి చేష్టలూ గుర్తుచేసుకొంటూ నవ్వుకొంటూ నెమ్మదిగా కూడలి వేపు నడక సాగించారు.

రాంపూర్ కూడలి చేరేసరికి వెన్నెల మరింత చిక్కపడ్డా, వెన్నెల విహారం లో వుండాల్సిన తృప్తి మాత్రం మిగ లేదు. అక్కడ అంతా నిశ్శబ్దమైన కీచురాళ్ళ మోతతో హోరెత్తి పోతోంది.

'టార్టాయిస్ నడకలు నడిచినా మనమే విజేతలం!' .... అంటూ ముగ్గురూ బండరాళ్లమీద కూర్చొని అలుపు తీర్చుకొంటూ సునీత జూలి యస్‌ల కోసం ఎదురు చూడసాగారు...

కబుర్లతో, ఎదురు చూపులతో మరో అరగంట గడిచిపోయింది.... వెన్నెల మరికాస్త చిక్కబడింది.... చలి కూడా పెరిగింది.

"ఆల్ రైట్! మనమే వాళ్లకోసం ఎదురేగి స్వాగతం పలుకుదాం...." అన్నాడు డాక్టర్ మల్హోత్రా.

"కూర్చోవోయ్!... కబుర్లలో పడి నడక మర్చిపోయి వుంటారు... వాళ్ళే వస్తారు!.. ఆలాగా కాళ్లు పీకడం సర్దుకుంటుంది మనకు" అన్నాడు చలికి బిగుసుకు పోతున్న కాళ్ళను గాలిలో ఆడిస్తూ రాజేష్.

మరో అరగంట గడిచింది.

"కమాన్ బోయ్స్, లెటస్ గో బాక్ - చలిగాలి వీస్తోంది..." అంటూ లేచాడు డాక్టర్ మల్హోత్రా.

అడవి దారిలో మిణుగురులు, అలంకరించినట్టు .. చెట్లలో అంటుకొని వున్నాయి.

"ఓయ్ ... డాక్లూ... నన్నడిగితే ... ఈ చలిలో... ఏ చెట్టు మీదనో ఆకుల మాటున కొమ్మల మధ్య.... ఆలా పడుకొని తెల్లవారేదాకా నిద్ర పోవాలంటాను!" అన్నాడు రాజేష్.

"పాపం... ఎందుకటా ? .... మనం ఏమైన అడవిలో షికారీలమా ? ... గేమ్‌కోసం వచ్చామా ?.... నెక్స్‌ట్ ఇయర్ డాక్టర్ మల్హోత్రా ఆలాటి ఏర్పాటు ఏదైనా చేస్తే తప్పకుండా ఆ కోరికా నెరవేరుతుంది, రాజేష్" అన్నాడు షార్మా....

"వైనాట్.... కానీ ... మీలో ఒక్కడికీ గన్ పట్టడం చేతకాదేమో !" .... అదను చూచి దెబ్బకొట్టాడు మల్హోత్రా.

పైకి ఎన్ని కబుర్లు చెప్పుకొంటు న్నా.... అందరి చూపులూ.... ముందున్న బాటమీదే వున్నాయి.... అప్పటికీ ఎదురు రాని ఆ యువ జంటకోసం ఆత్రుతగా ఆ మసక వెలుతుర్లో వెతుక్కుంటున్నారు ఎవరికి వారే....

దాదాపు సగం దూరం నడిచాక... బాట అందున... ఓ మానవాకారం నించొని వున్నట్టు పసిగట్టి, .... "ఎవరదీ ? .. బేబీ ." అంటూ ఆత్రుతగా పిల్చాడు డాక్టర్ మల్హోత్రా.

"నేనే మామయ్యా... సునీతను" అంటూ బదులిచ్చింది.

గబగబా నడిచి సునీతను చేరుకొని "ఏమ్మా... ఇక్కడే నుంచుండి పోయావు... మిస్టర్ జూలియస్ ఏడీ ?" అన్నాడు చుట్టూ కలియ చూస్తూ...

"నన్నిక్కడే ఉండమని.... అతను ఈలా.... చెట్ల మధ్యగా వెళ్ళాడు....

వెళ్లి కూడా దాదాపు గంటపైనే అయింది" - వాచి చూచుకొందిసునీత.

ఎలెక్ట్రానిక్ వాచీలు కళ్లకు దగ్గరగా పెట్టి చూచు కున్నారు ముగ్గురూ.. తొమ్మిది కావస్తోంది.

"సరె.... మరి కాసేపు చూద్దాం" అన్నాడు డాక్టర్ మల్హోత్రా.

కొమ్మల సందుల్లోంచి దూసుకొచ్చిన చలిగాలి చెంపలను తాకి కసిగా బాధించసాగింది.

"అడవి దారిలో అతని కేంపని? అసలే దేశానికీ ప్రాంతానికీ కొత్త.... కాల్స్ ఆఫ్ నేచర్ అంటూ వెళ్ళి.... తప్పి పోలేదు కదా ?"-, స్వగతమైనా గట్టిగానే అన్నాడు మల్హోత్రా.

"ఏ విషపు పురుగో వాతో పడ లేదు కదా? ఇంత సేపా" - సందేహం వెలిబుచ్చాడు షార్మా.

"అడవి మార్గంలో ఏదైనా సంభవమే !... కమాన్ లెటజ్‌గో ఇన్ సర్చ్ ఆఫ్ హిమ్..." అంటూ సునీత చూపిన దిక్కుగా ముందుకడుగేశాడు డాక్టర్ మల్హోత్రా.... మిగిలిన ముగ్గురూ వెన్నంటి నడిచారు.

పెన్‌టార్చి ఫోకస్ చేసుకుంటూ.... జూలియస్ పేరెట్టి పిలుస్తూ జాగ్రత్తగా ముందుకు సాగారు.

అక్కడున్న చెట్లమధ్య, పుబుర్ల మధ్య వెదకి 'నో లక్' అన్నాడు మల్హోత్రా.

ఓపిక నశించే దాకా అక్కడక్కడ చెట్లమధ్య వెదకి "ఫ్రెండ్స్, చేయగలిగిందేమీ లేదు. చీకట్లో ఇంటికెళ్ళి మనుష్యులను తెద్దామన్నా అందరూ హాలిడే తీసుకున్నారు.... మిగిలింది... రేపు ఉదయాన్నే వెలుతుర్లో వెదుక్కోవడమే".... అన్నాడు.... మల్హోత్రా.

"మామయ్యా అతను అసలే కొత్తవాడు.... ఏదైనా ప్రాణాపాయం సంభవించి వుంటే. రాత్రంతా చలిలో అడవిలో.... ఒంటరిగా.... వదిలి వేయడం !.... తెలియక పోతే ఫరవా లేదు గానీ... మనిషి తప్పి పోయాడని తెలిసి తాత్సార పడ్డం మంచిదంటారా !" అంది... సునీత.

"మరేమి చేద్దాం, బేబీ ?" - పిసరంత విసుగు ధ్వనించింది మల్హోత్రా కంఠంలో.

"మరి కాస్సేపు వెతుకుదాం ఇలాగే.... నూతన సంవత్సరం బోనస్ అనుకుందాం !...' దగ్గరగా నడిచి మేనమామ కుడి భుజానికి తల ఆన్చింది... సునీత.

ఆమెనలాగే హగ్ వేసుకొని... "ఆల్ రైట్, బేబీ... అలాగే వెదుకుదాం ?... దొరక్కపోతే... ఇంటికెళ్ళి ... ఎవరినైనా సాయం తెచ్చి మరీ వెదుకుదాం... ఓకే..." అన్నాడు తల మీద పెదిమలాన్చి.

రెండు చేతులతో వాటేసుకొని "థాంక్యూ, మామయ్యా థాంక్యూ, సో మచ్" అంది.

జూలియస్‌ను పేరెట్టి పిల్చుకొంటూ ... చెట్ల మాటున వెదుక్కుంటూ... మరి కాస్త ముందుకెళ్ళారు.... ఎత్తయిన చెట్లు అక్కడితో అంతమై, కాస్త మేర మైదానం అవుపించింది...

దూరాన... గుడిసెలాటి... ఆకారం చూచి "గుడ్ ఇక్కడెవ్వరివో ఝోప్డిలు వున్నట్లున్నాయి... అదీ మంచిదే, వారి సాయం తీసుకోవచ్చు" అంటూ హుషారుగా ముందుకడుగేశాడు... మల్హోత్రా...

ఝోప్‌డీ తలుపు బార్లా తీసివుంది. వెన్నెల వెలుగు, తీసిన తలుపుగుండా, లోన పడుతోంది - ఆ వెన్నెట్లో మానవకారం...

వెన్నెల వెలుతుర్లో పడి వున్న మానవాకారాన్ని జూలియస్‌దిగా అనుమానించి... సునీత 'మిస్టర్ జూలియస్' అంటూ ముందుకు పరుగెట్టింది.

"ఎవరమ్మా... మిస్టర్ జూలియసేనా ?" అంటూ ఆత్రుతగా అడుగులేసి ఆ గుడిసెలో అడుగు పెట్టాడు మల్హోత్రా.

చలనం లేకుండా పడివున్న ఆకారం ముఖం మీదకు పెన్‌టార్చి ఫోకస్ చేయడమేమిటి, బల్బు మాడి పోవడమేమిటి ఒకేసారి జరిగాయి.

"ఇంట్లో బల్బులూ అంతే.... టార్చి బల్బులూ అంతే.... ఏ వస్తువు కొన్నా మన్నిక వుండడంలేదు"....- తిట్టుకొంటూ జేబులోకి జారవిడిచాడు మల్హోత్రా....

(ఇంకా వుంది

JAGATI, Telugu Monthly ... Edited, Printed and Published by MR Chendur at MANASA PRESS, No 2 Kutchery Road, Mylapore, Madras 600 004